రామానుజాచార్య విద్యాసమితి
ప్రచురణము నెం 12 రు



# చీనా—జపాను
# జెకోస్లావేకియా—జర్మనీ.

చందాదారులకు 0-4-0
ఇతరులకు 0-6-0

కె. రంగాచార్యుడు



# చీనాపై జపాను దుండగీడుతనము.



1914లో మహాసంగ్రామములోఁ బాశ్చాత్యదేశములు మునిఁగి పోయి యున్నప్పుడు, ప్రాచ్యదేశములగుఱించి యెవ్వరు నాలోచింపనైన నాలోచింపలేదు. హిందూదేశము బ్రిటిషు ప్రభుత్వాధీనములో నుండుటచేతఁ గొంతవఱకుఁ బాశ్చాత్య సంగ్రామములోఁ గొంతసంబంధము కలిగి బ్రిటిషు ప్రభువుల కుపకారము చేయుటలో హిందూదేశవాసులు సర్వయత్నములను సలుపుచు నుండిపోయిరి. జర్మనుల యధీనములోనుండిన చీనావారి "ట్సింగ్ టౌ" అను నోడరేవును బట్టుకొనుటయును, నందుండు జర్మనీదేశస్థుల ఖైదులో నుంచుటయును, పసిఫిక్ మహాసముద్రములో మిత్రమండలితరఫున నోడరేవులను గాపాడుచు నోడవర్తకమున కెట్టిహాని జరుగకుండ నుంచుటయును, జపాను ప్రభుత్వమునకు నాంగ్లేయ మిత్రమండలివా రొప్పచెప్పిన పని. ఆపనిని త్వరలోనే జపాను నావికాదళములు సాధించెను. అప్పటినుండియు జపానుగురించిగాని, చీనాగురించి గాని యెట్టి యుదంతములును బ్రపంచ వార్తాపత్రికలలోఁ గాన్పించుటలేదు. ఆసమయములోఁ బ్రపంచదృష్టియంతయు మహాసంగ్రామముపై నిగుడింపఁబడియుండెను. పైకిమాత్ర

మీరీతిగనుండెనుగాని వాస్తవముగా నటులుండలేదు. 1915 మే నెలలోఁ బ్రపంచకలహము కలుగఁజేయుటకుఁ దగిన సంభవములు జరుగుటకుఁ బ్రారంభించెను. మే నెల 7వ తేదీని జపాను ప్రభుత్వమువారు 21 షరతుల కొడంబడికమని విధించుచు నొక యాజ్ఞాపత్రము వంటి నివేదికను చీనాప్రభుత్వమునకు జారీ చేయించిరి. ఈషరతులను చీనాప్రభుత్వ మంగీకరించినచో నాసియాఖండములో స్వాతంత్ర్యముగల ప్రభుత్వము లంతరించుటయేకాక దేశముల సరిహద్దులుకూడ సంపూర్ణముగ మారిపోయియేయుండును. దుర్బలమును, అంతఃకలహములచే బలహీనమై లంచకోండ్రైన యున్నతాధికారులతో నిండిన యెడల చీనాప్రభుత్వము షరతుల నమలులోఁ బెట్టినయెడల జపానువారి చేతులలోఁ గీలుబొమ్మ స్వాతంత్ర్యమును బోగొట్టుకొని నీచస్థితిని బొందవలసియే యుండును.

ఈనివేదిక నతి రహస్యముగాఁ జీనా ప్రభుత్వమునకు జపానువారు చెందజేసిరి. ఈషరతులను బయటపెట్టినచోఁ జీనావారి రాజధానియైన పెకింగులోనుండిన యున్నతోద్యోగులను జంపెదమని జపాను ప్రభుత్వమువారు తర్జించిరి. ఇంతలో రష్యను రాయబారిచారులీకాగితమును బయటకుదీసిరి. అది యమెరికా వార్తాపత్రికలవారిచేఁ దద్దేశపు వార్తాపత్రికలలోఁ బ్రకటింపఁబడినది. ఈవిషయ మతివిపులముగాఁ జర్చగావింపఁబడవలసినదేగాని యప్పటి పరిస్థితులు విషమముగా నుండుటచే నదిజరుగలేదు. రష్యనులు "గలీషియా"లో

దెబ్బలుతిని వెనుకకుఁ బారిపోవుటకుఁ బ్రారంభించిరి. అమెరికాలోని జర్మను రాయబారి యూరపుఖండమునకుఁ బ్రయాణముచేయుట మంచిదికాదని యమెరికా పత్రికలలోఁ బ్రకటించినాఁడు. అపుడె యింగ్లీషు సేనానియైన "సర్ జాన్ ఫ్రెంచి" జర్మనులు యుద్ధములో సైనికులను నూపిరిసలుపకుండ జేసి చంపివేయుటకై విషవాయువులను బ్రయోగించుచున్నారని ప్రపంచకమునకుఁ బ్రకటించెను ఆఘోరముగూర్చి యోచింపుచుఁ బ్రపంచమీ చిన్నవిషయమును బాటింపక మరచిపోయినది.

పాశ్చాత్య ప్రభుత్వములకుఁ జీనా దేశముతో లాభకరములైన సంబంధము లుండెను. చీనాలో వర్తకముచేయుచుఁ బాశ్చాత్యదేశాల వారమితిలాభములు పొందుటచే సామాన్యమైన పరిస్థితులలో నిట్టి దుండగీతనమును జపానువారు చేయుచుండినచో నెంతమాత్రము యూరకొని యుండి యుండరు. కాని పాశ్చాత్యప్రభుత్వములు చావుటయో బ్రతుకుటయో తెలియక ఘోరయుద్ధముసాగించుచుండినవి. అట్టి సమయములో నింగ్లాండు ఫరాంసు, రష్యా, జర్మనీ, ప్రభుత్వము లేమియుఁ జేయలేక దుర్బలత్వముచేత నూరకొనియుండిరి. ఆనివేదిక జారీచేయించుటకుఁ బూర్వదినమున "లూజిటానియా" అను నోడను జర్మనులు ముంచివేసిరి. ఆప్రమాదములో వేయికంటె నెక్కువగ నిస్సహాయులై యుద్ధముతో నెట్టిసంబంధము లేని ప్రజలు మృతినొందిరి. వారలలో 114 మంది యమెరికనులు; అందుచే నమెరికాకు మతిపోయినది. అప్పటివరకు

యుద్ధమునతో జోక్యము లేకుండ యుపేక్షము వహించకుండ యుండిన యామెరికాదేశ మాంగ్లేయ మిత్రమండలి పక్షము నవలంబించెను. ఈయుదేశములలో జపాను చీనాగురించి చేయుటకు సంసిద్ధముగానున్న యన్యాయమును బ్రపంచము గమనింపలేదు.

ఈషరతులను మూడు భాగములుగా విభజింపవచ్చును. "షాంటింగు"లో జర్మనీవారికి గొన్ని విశేషాధికారములుండెడివి. ఆషాంటింగు మండలమును జర్మనీవారివద్దనుండి జయించుటలో వారికి నాయధికారములు సంక్రమించినవని జపానువారు నిశ్చయించుచు నామండలములో జర్మనీవారికి నెప్పుడులేని క్రొత్తయధికారములు కూడ తమకు సంక్రమించునటుల చీనావారిని సంచరించమని జపానువారు కోరిరి. షాంటింగు మండలము "కన్ఫ్యూషియస్" "మెన్షియస్" అను చీనాదేశపు మహాత్ములకు జన్మస్థానమగుటచే చీనావారిచే నది పుణ్యభూమిగా బరిగణింపబడుచున్నది. ఈ మండలము తమరక్షణలోనేయుండవలెననియు, మంచూరి ప్రాంతగ్రామములలోను, మంగోలియాలోను, వారికి విశేషహక్కు లుండవలెననియు, జపానువారు కోరిరి. మంచూరియాలో దక్షిణభాగము "రష్యాజపాను" యుద్ధములో జపానువారు జయించి యాక్రమించుకొనిరి. అద్దానిని మొదట రష్యావారు చీనావారిని దండించి వారివద్దనుండి కౌలుకు పుచ్చుకొనిరి. కౌలు అంతముకాగానే యుద్ధానికి 99 సంవత్సరములు కౌలునకు నియ్యవలయునని

జపానువారు చీనావారి నిర్బంధము చేయడము ప్రారంభించి
నారు. రష్యావారికుంచిన యధికారములనుగాక విశిష్టములయిన
యధికారములను నిమిత్తముగా జపానువారు కోరిరి. మంగోలి
యాంతర్భాగములోనుండు చీనాసామంతప్రభువులను చీనా
ప్రభుత్వమున కలజడిచేయువారలుగఁ జేయుచు వారికి స్వాతం
త్రిలుగ నొసఁగుటకై జపాను ప్రభుత్వము పితూరీలను వారిచే
చేయించుచుండెను. మంచూప్రరాజుతోఁ గుతంత్రములు
పన్నుచుండిన జపానువారి మండలములోఁ గొన్నిహక్కులేర్ప
డినవని దబాయించుచు విశేషహక్కులను దౌర్జన్యపూర్వకముగఁ
గోరిరి. పైనఁజెప్పినది నైఋతివిభాగములో రెండవవిభాగమని
తెలిసికోవలెను.

ఇంక మూఁడవ విభాగము! "లీహాంగ్చంగ్" అను
నాతఁడు చీనావారి ధనముతో "హాన్ యెహ్పింగు కంపెనీ"
అనుపేరుతో నిర్మించి యుద్ధవస్తువులను తయారుచేయు
సంస్థను స్థాపించెను అంత పెద్దసంస్థ చీనాదేశములో మరి
యొకటిలేదు ఆసంస్థయే చీనాదేశములో నుపయోగపడు
నినుమును, ఉక్కును, తయారుచేయుచున్నది. దీనితోఁ గలసి
యొక యుద్ధయంత్రములు తయారుచేయు కర్మాగారము
యున్నది. అదియొక గొప్ప కర్మాగారము. ఈసంస్థలోఁ
గొన్నివాటాలు జపానువారు సంపాదించిరి. ఐనను నాసంస్థపై
సంపూర్ణహక్కులన్నియుఁ దమకిచ్చివేసి తమ యధీనములో
నాసంస్థను బెట్టవలయునని జపానువారు విధించిరి.

"ఫూకీ" యను మండలము చీనాలోనున్నది. ఈమండలముయొక్క సముద్రతీరమునను్న నౌకారేవుల నన్నిటిని తమకుఁ గౌలున కిచ్చివేయవలయుననియు, జపానువారి యనుమతిలేనిదే యీమండలసముద్రతీరమునందు నోడరేవు ఁగాని, యేవంకనుగాని విదేశీయుల కెవ్వరికిని కౌలున కీయరాదనియు జపానువారు కోరిరి. "ఫార్మోజా" అను దీవిని పూర్వము జపానువారు చీనావారినుండి జయించిరి. ఆదీవికిని 'ఫూకీ' యను సముద్రతీరమునకును నెంతో దూరములేదు. ఫార్మోజాలోఁ గోటలు మొదలగువాని నటుకముగాఁ గట్టి యుద్ధపరికరములలో నతిబలముగాఁ జేసిరి. జపానువారు దీనికి దగ్గరగా యుద్ధనావలకు ననువగుస్థానమును సంపాదించినచోఁ దక్షిణ చీనాభాగమున్ను "యంగ్‌ట్సీ" నదియొక్క ముఖభాగమున్ను, కరతలామలకములై జపానువారి యధీనములోనుండు నని వేరుగఁ జెప్పనవసరము లేదు. ఇది షరతులలో నాల్గవ భాగము.

ఈపైనిచెప్పిన షరతులయిదవభాగములోఁగల షరతులఁ బోల్చిచూచినచోఁ జీనావారికి నామొదటివి యుపకారము కలుగఁజేయువానివలెఁ గాన్పించును. ఈషరతులు నమలులో నుంచబడినచోఁ జీనాస్వాతంత్ర్యము హుళక్కి యగును. జపానుయొక్క యధికారము స్థిరీభూతముగా నేర్పడుటకును, జీనావారి దాస్యము పరిపూర్ణముగాఁ జేయుటకును నీషరతు లుపచరించునట్టుల మరియేషరతు లుపచరింపవు. ఈషరతుల

ప్రకారము చీనాయొక్క సేనలున్ను, నావికాదళములున్ను, జపాను సైనికోద్యోగులచేతను, యుద్ధనావికాధికారులుచేతను, దరికేడులో నుంచబడవలెనట! చీనా దేశపు రాజస్వమును ఇబ్బందిలేక సమానముగా నుంచుటకు చీనావారు జపానువారి నాగరిక పండితుల నుపయోగించవలెనట! ఈషరతుల నమలులో నుంచినచోఁ జీనా సైనికదళములను, రాజస్వమును, జపాను వారి యధీనములోఁ బెట్టినట్లగునని నిశ్చయమగుచున్నది. అది జరిగినచోనే చీనావారు జపానువారి దాసులగుదురని నిశ్చయము. షరతులలో మాత్రము చీనాప్రభుత్వము సాంగ్రామిక, నావిక, ఆర్థిక, యుపదేశకులుగ మాత్రము జపానువారలనె వినియోగింపవలెనని బయటకుఁగాన్పించినను, నట్టి జపాను వారు జపాను ప్రభుత్వముచే నియోగింపఁబడుటచే వారి యుపదేశములు హానికరములేయగుననియు, నట్టివాని నిరాకరించిన జపాను సేనలా యుపదేశములను జీనా ప్రభుత్వమంగీకరించునటులఁ జేయుననియు, వేరుగఁ జెప్పనవసరములేదు. ఇంతటితో షరతులంతముకాలేదు. చీనావారి దేహములను మాత్రము స్వాధీనములోనుంచికొనినచో జయము సంపూర్ణముకాదని జపాను వారికిఁ దెలియును. మరియు ననేక భిన్నజాతివారలు చీనాను జయించిరి కాని, జయించినపిదప వారి వ్యక్తిత్వమునుగోలుపోయి చీనా ప్రబోధము నంగీకరించుచు, వారిలోఁ గలసిపోయిరని చరిత్ర ప్రకటించుచున్నది. అందుచే జపానుభాష చీనావారికి బోధపరచుటకు స్కూళ్లను దేశమునందంతటను జపానువారు

స్థాపించుటకుఁ జీనావా రంగీకరింపవలయునట! ఐనను బదులను నడుపుటకుఁ గావలసిన ధనమును జీనావారే వెచ్చింపవలయును. ఈవిధమున జీనాదేశములో విద్యావిధానమంతయు జపాను వారిదగులయే కాక జపానుభాషయే కొలందికాలములోఁ జీనా దేశములో రాజభాషయగునని స్పష్టమగుచున్నది. ఇంతటితో నూరుకొనలేదు జపానువారు. జపాను మతప్రచారకులు చీనా దేశములో విరివిగాఁ బ్రచారము సాగించుటకు నధికారము చీనావారు జపానువారి కీయవలెనని యింకొకషరతు. జపానులో బౌద్ధమతప్రచారము చీనామత ప్రచారకులవలనే గావింపఁబడినదని తెలిసికొనినచో నీజపానువారి కోరికె యెంత వింతయైనదని గన్పట్టకమానదు. అయితే చీనావారు తెలిసికొనవలసిన నూతనమతములో ముఖ్యసిద్ధాంతము జపాను సామ్రాట్టుయొక్క దైవత్వమును, నా రాజుయొక్క యర్చనావిధానమునుఁ గాని వేరెట్టివి కావు. చీనావారిసిద్ధాంతములోఁ జీన సామ్రాట్టును దేవునియొక్క కుమారునిగ భావించుచుండుట యున్నది గాని, యథార్థముగ నది జరుగుచుండుట లేదు. ఈవిధమున నాధ్యాత్మికముగాను, రాజకీయ విషయములలోను, జీనావారిని బానిసలుగాఁ గావించుటకే నవసరమైన షరతుల నములులో నిర్బంధించియైనను పెట్టడమునకు తగిన యేర్పాటులను జపాను సాంగ్రామిక ప్రభువులు గావించిరి.

ఈ యయిదవ విభాగములో నాఖరుషరతు ఫూకియను మండలములో నోడరేవులు కట్టుటకుఁగాని యినుపదారు

నిర్మించుటకుఁగాని యవసరమగు ధనమును జపానువారి యాంగీకారము లేని దేశర ప్రభుత్వమువద్దనుండిగాని పర దేశీయధనాఢ్య కులవద్దనుండిగాని చీనా ప్రభుత్వము యప్పు పుచ్చుకొనకూడదట.

ఈషరతుల నొప్పుకొనవలయునని జపాను నిర్బంధము చేయుచున్నపుడు "యువన్ షికై" అనువాఁడు ప్రజాతంత్ర పరిపాలనాధికారియై యుండెను. జపాను కొరియాదేశములో సర్వాధికారము చెలాయించుటకుఁ బ్రయత్నము సాగించినపుడు "యువన్ షికై" కొరియాప్రభుత్వములో నున్నతాధికారియై యుండినవాఁడు. అప్పుడు చీనా జపాను దేశములకు జరిగినయుద్ధములో, యుద్ధవీరులైన జపానువారు జయమును బొందఁగనే మంచూప్రభువులు చీనా సేనలను దయాగచేయు కార్యమును "యువన్"కు నప్పఁజెప్పిరి. ఆకార్యమును చతురతతో షికై నెరవేర్చె. చీనాదేశపు సైన్యముల శత్రువులు భయపడవలసిన పుష్టివానిగ నొనర్పుటచే జపాను ప్రభుత్వమున కితనియందు ద్వేషము జనించె. ఇంతలోఁ జీనాసమ్రాట్టు నాశ్రయించియుండిన రాజవల్లభులీ నీతిశూన్యునిపై కుట్రనుబన్ని యధికారము నాతఁడు విడుచునట్లు చేసిరి. అందులకు జపానుప్రభుత్వము సంతసించెను గాని యింతలోఁ గాలచక్రపరివర్తనమువలన "యువన్ షికై"ని చీనా ప్రజాతంత్ర రాజ్యమున కధ్యక్షునిగఁ జేయుటచే జపాను ప్రభుత్వమునకుఁ గష్టము తోఁచినది. ఐనను చేయున దేమియు లేక వారూరకొనిరి. జపానువారి కుతంత్రములను,

వారు వానిని ప్రయోగించు విధానమును తెలిసినవారగుటచే "షైరై" యనిజాగ్రత్తతో సంచరించుచుండెను.

జపానుయొక్క షరతులు ప్రపంచమునకు వెల్లడి కాఁగా జపాను దేశపు రాజతంత్రప్రవీణులు వివిధదేశములలో నట్టిషరతు లెవ్వియును లేవనియు, లేక జపాను ప్రభుత్వము వారు జారీచేయించిన షరతులవలన నెట్టిహానియుఁ జీనాకుఁ గలుగదనియు నివేదికలను ప్రకటించిరి. జపాను పరిపాలన యీసమయమందున, సాంగ్రామికాధికారుల యధీనములో నుండెను. ఆయధికారులు జపాను రాయబారులకు నీషరతులఁ గూర్చి యుక్తమైనవిధాన నేమియుఁజెప్పలేదు. రాజతంత్రి ప్రవీణులతో నీవిషయములఁగూర్చి యెట్టిసంప్రహమునైనను జేయ లేదు. అమెరికా ప్రభుత్వము జపాను రాయబారులు చెప్పిన యబద్ధములను నమ్మెను. కాని తదితరప్రభుత్వము లమాత్రము రాయబారుల మాటలను విశ్వసింపలేదు. ప్రపంచములోఁ గొంతకలవర మిందువిషయమై బయలుదేరినది. చీనా ప్రభుత్వోద్యోగులు కొందఱు జపానేమిచేయునోయను భయము చేతను, మఱికొందఱు లంచములనుదినియు, జపానుప్రభుత్వము షరతులను జారీచేయించిన 48 ఘంటలలో, వానిని వాచా యంగీకరించిరి. ఈషరతుల నంగీకరించుటచేఁ జీనా తదితర పాశ్చాత్య ప్రభుత్వములతోఁ గావించిన యొడంబడికలను రద్దు పరచినదని సంక్షోభము కలిగినది. ఈప్రభుత్వములు తమ రాయబారుల మూలమునఁ గొంతనిర్బంధము కలుగఁజేయఁగా

మొదటి 21 షరతులలోను దాదికి 7 షరతులు మాత్రమే మిగిలి నవి. ఫ్రాంకి యోను మండలములో భాగాలను జపానువారికి గౌలునకిచ్చు షరతంతెరించెను. కాని మరి యేప్రభుత్వానికి నందులో భాగములు కౌలున కివ్వకూడదని నిశ్చయమయ్యెను. చీనాదేశపు రాజ్యమును, సేనలను, నావికాదళములను జపాను ప్రభుత్వాధీనం చేసేషరతు మతరాం రద్దుచేయబడినది. తక్కిన షరతులలో జాలవఱకు మార్పులు కావింపబడినవి. కాని యీమార్పులు చీనాదేశమునకు నెట్టి యుపకారము గావించు టకుగాదు. పాశ్చాత్యప్రభుత్వముల లాభముకొఱకే యీ మార్పులు గావింపబడినవని గుర్తెరుంగవలెను. వింపబడినవని గుర్తెరుగవలెను. అప్పుడు సంభవించిన సంకటావస్థ యీవిధము గా దాటబడెను. కాని జపానువారు మాత్రమీ 21 షరతుల నంతమాత్రము మరువలేదు. అవి యెప్పటికి నిజపాను రాజతంత్రవేత్తల మనఃఫలకములపై ముద్రింపబడియుండిపోయినవి.

నలువది రెండేండ్లక్రిందట జపానువారికిని చీనావారికిని జరిగిన సంగ్రామములో జపానతిసౌభాగ్యముతో జయము సంపాదించిన నాటినుండియు జపానువారి దృష్టి "కాకమ్మ కండ్లు ఎంతగు పై" యున్నట్లు చీనాపైబడినది. చీనాదేశము నధీనము చేసికొనుట జపానుయొక్క ముఖ్య రాజకార్యమై యుండెను. చీనాచక్రవర్తి యాశ్రితులకు లంచములిచ్చియు, కుతంత్రములు బన్నియు, జపాను ప్రభుత్వము తమకోరైన

అట్టివారికి రాజకీయసాంగ్రామిక విషయములఁగూర్చి సలహాల నిచ్చుటకొరకు వారలకు డబ్బునిప్పించియు, యుద్ధపరికరములని చ్చుచు వానిమూల్యమును నలువైన వాయిదాలలోఁదీర్చుకొ నేషరతులపైనిచ్చియు, నరాచకమును బెంపొందించి దేశనాశన మునకై సర్వప్రయత్నములను సలుపుచుండిరి. ఇట్టి దుష్టకార్య ములుచేసి దేశద్రోహులైన చీనసేనానాయకులనుండి, జపాను వారు తమాయాధికారమును జీనా దేశములో దృఢముగాను చిర స్థాయిగానునుండుట కనువగునట్టి షరతులతో నొడంబడికలను గావించునటులఁ జేయుచుండెడివారు. జపానువారిట్టి యొడంబ డికలనన్నింటిని, ఆ 21 షరతులను, జీనాప్రభుత్వ మంగీకరించు నటులఁజేసి యేకముచేయఁ దలచుకొనెను గాని యాషరతు లన్నియు నంగీకరింపఁబడకపోవుటచే జపానునకు సంపూర్ణముగా మనోరథసిద్ధిజరుగలేదు. ఇంతలో "యు అన్ షిక్తై" యతి వింతమైన పరిస్థితులలోఁ గాలధర్మమునొందెను, చీనాదేశము తిరిగి యరాచకస్థితిలోఁ బడిపోయెను

ఐరోపాఖండములో మహాయుద్ధ మతిఘోరముగాఁ జెల రేగుచుండెను. కావున నాంగ్లేయులు మొదలగు మిత్రమండలి వారందఱును యుద్ధమును నడిపించుటలోనే తగుల్కొనియుండ వారు చీనాలోనుండిన రాచకార్యముల నన్నిటిని జపానువారి చేతిలోనుంచిరి. మొదట యమెరికా యుద్ధములోఁ బాల్గొన లేదుగాని, తుదకదియును యుద్ధములోఁ బాల్గొనెను. అందుచేఁ బాశ్చాత్యప్రభుత్వములన్నియుఁ జీనాలో వానికుండిన వాక్కు-

లకు నధికారములను గాపాడుటకు జపానుపై నాధారపడి యుండుట కారంభించెను. చీనాలో యుద్ధము లేక శాంతియుండిన యెడల తదితర పాశ్చాత్యదేశముల వారా దేశముతోఁ జేయుచుండిన వ్యాపారమునకు భంగము కలుగకుండ యుండునని యెంచి వారును జపాను ప్రభుత్వము చీనా దేశములో నతి దృఢముగా రాజకార్యములను చక్కబెట్టుచుండవలెనని గోరుచుండిరి. ఇంతలోఁ జీనాలోనుండిన యాంగ్లేయులయొక్కయు, ఫరాసులయొక్కయు, నమెరికనులయొక్కయు బ్రాణమానములను సేనలనుపంపి రక్షింపవలసిన యవసరము తటస్థించినయెడల, లాభకరముగా నుండునని తలంచి, జపానట్టి యవసరము కలుగునట్లు చేయుటకుఁ బ్రయత్నముల నారంభించెను. చీనాలో నరాచకము ప్రబలినచోఁ గాని యట్టి యవసరము కలుగదని తెలిసికొని యా దేశములో నరాచకము ప్రబలుటకై సర్వయత్నములు చేయుటకు జపాను ప్రారంభించెను. దైవవశమున యూరపు మహాయుద్ధములో జర్మనీదేశమే జయము పొందినచో, నపుడు జపానునకు మరింత లాభసాటిగా నుండునని స్పష్టపరచుకొని యా ప్రభుత్వము చేయఁదలపెట్టిన కార్యమును తీవ్రముగా సాధించుట మొదలుపెట్టెను. జపాను లాభము పొందవలెనని నచో నది మహాసంగ్రామము ముగియక పూర్వమే సంపూర్ణము కావలయును. ఏలయన, యుద్ధము ముగిసినచో మిత్రమండలి వారి హక్కనుభవములను గాపాడుకొనుటకు వారి యుద్ధనావలు తయారై యుండునని జపానుకుఁ దెలియును.

ఈ పైచెప్పిన యుద్దేశములను మనస్సులోఁ బెట్టుకొని జపాను ప్రభుత్వము చీనా సాంగ్రామిక ప్రభువులయొద్దనుండు జపాను దేశస్థులగు నుపదేశికుల సంఖ్య నపరిమితముగాఁ బెంచెను. యుద్ధసామగ్రి కొనుటకై యప్పులు మితిలేక జపానువారిచేఁ జీనా సాంగ్రామిక ప్రభువుల కీయఁబడుచుండెను. ఎక్కడనుండియో తెలియకుండ డబ్బును యుద్ధపరికరములును నీసాంగ్రామిక ప్రభువుల కెడతెగకుండ నిరంతరము చెందఁజేయఁబడుచుండెడివి. వీరిలో నేపాటి పేరుప్రతిష్ఠలుండి ప్రాముఖ్యత గలిగియుండినను నట్టి సాంగ్రామిక ప్రభువు తదితరులతో యుద్ధముగావించునటులఁ బ్రోత్సహింపఁబడుచుండెడివాఁడు. చీనా యాధిపత్యములోనుండిన మంగోలియా దేశపు వివిధ జాతులవారు స్వాతంత్ర్యముగల రాజ్యముల నేర్పాటుచేయుటకై ప్రభుత్వముపై తిరుగుబాటొనరించునటులఁ బ్రోత్సహింపఁబడుచుండెను. వీరు పితూరీలు చేయుచు వారి చుట్టు ప్రక్కలనుండు చీనా మండలములను కొల్లగొట్టునటులఁ బ్రోత్సహింపఁబడుచుండెను ఇద్దానితో నూరుకొనక దొంగలగుంపులు సైతము మండలములను దోచుకొనుచుఁ బ్రజలకుఁ బ్రాణహానియుఁ ధననష్టమును గలుగఁజేయునటులఁ బ్రోత్సహింపఁబడుటచేఁ జీనా దేశములో దోపిడికాండ్ర గుంపులంతులేక పెరిగిపోయినవి. వారి దుండగీడుతనమునకు మితిలేకయుండెను. ఈ దండిమూకలకెల్లను జపాను ప్రభుత్వపు ప్రతిహస్తులు యుద్ధపరికరములను నతిసులువైన షరతులపైనిచ్చుచు నంటిపెట్టు

కొనియుండుట ప్రారంభించిరి. జపానువారి సహాయముచే "చంగ్ ట్సోలిన్" అను దొంగలఱేఁడు మంచూరియా దేశమునకుఁ బ్రభువయ్యెను. అందుచేఁ దదితర ప్రభుత్వముల వారు జపానువారినివిడనాడి వారిసాహాయ్యమును గోరునట్టులఁ గావింపబడిరి. చీనాలో నరాచకముఁ బొపొందించుటయును, సంక్షోభము వృద్ధిచెందించుటయును జపాను ప్రభుత్వమునకు ముఖ్యకార్యములయ్యెను. ఐరోపాయుద్ధములో జర్మనీజయముపొందుటయె జపానునకు లాభకరమైయుండుటచే జపానువారు జర్మనీజయమునేకోరుట ప్రారంభించిరి. సాధ్యమగునంతవరకు వారి తమయుద్దేశమును ప్రకటింపలేదుగాని, పరప్రభుత్వములకీయుద్దేశము వ్యక్తమయ్యెను. చీనావారమెరికనులను దమమిత్రులలో ముఖ్యులుగఁ బరిగణించుటచే నమెరికనులనుచులకనచేయుటకై జపానువారు ప్రబలయత్నములను చేయఁ బ్రారంభించిరి. ఏ కార్యము చేయఁబూనినను పట్టుదలతో నిర్వహించుట జపాను వారి స్వభావము. కావున మహాయుద్ధములో నమెరికావారు పొందుచుండిన జయములను, చేయుచుండిన వీరకార్యములను చీనావారికిఁ దెలియకుండనుండుటకై తప్పుసోగత్రాలను జపాను వారు చీనావార్తాపత్రికలవారి కిచ్చుటయేగాక యట్టియుదంతములు ప్రకటింపఁబడునటుల గావించుచుండెడివారు. అమెరికా వారి సైన్యము లెంతమాత్రము ప్రశస్తములయినవికావనియుఁ జీనావారమెరికాబలములను నమ్మక జపానుబలమునే నమ్మినచో నయ్యది చీనావారికి శ్రేయోదాయకమైయుండుననియు

నిరూపించుటకై యమెరికా సేనలు పొందిన జయములను ప్రక
టించుట మానివేసియో, వానిగూర్చి చులకన చేయుచు
వ్రాయుటయో చేయుచుండెడివారు. ఇంతియగాక టోకియో
లోను, ఒసాకాలోను ప్రకటింపఁబడిన జపానువార్తాపత్రికల
లో సంభవింపని యమెరికావారి యపజయములు ప్రకటింపఁబ
డుచుండెడివి.

మహాయుద్ధములో జపానుప్రభుత్వమాంగ్లేయ మిత్రమండలి
తరఫున పాల్గొనుటకు జపానులో సామ్రాజిక పక్షమునకుఁ గాని,
ప్రజలకుఁగాని యంతయిష్టముగ నుండలేదు. జర్మనీపై జపాను
యుద్ధము ప్రకటించినపుడు "యోకొహామాలో" దుండగీడుల
గుంపు బ్రిటిషుజెండాను నొక ప్రాసాదముపైనుండి పెకలించి బుర
దలోఁ బడవేసి త్రొక్కిరి. ఇట్టిసంభవములు కొన్నియటుతరు
వాతనుజరిగెను; జపాను పోలీసువారు జాగ్రత్తతో నుండుటచే
అట్టి దుండగీడులకార్యములు మిక్కుటములు కాకుండనుండెను.
జపానువారికి నాంగ్లేయులకును సంధి యుండకపోయినచో జపా
నుప్రభుత్వమాంగ్లేయ మిత్రమండలి తరఫున యుద్ధములోనికిఁ
జొరఁబడకపోయియుండును.

జపానువారికి జర్మనులపై నభిమానముండెను. "ఇటో
రాజకుమారుఁడు" జపాను రాజ్యవ్యవస్థాపనమును "బిస్మార్కు"
అను జర్మనీ దేశపు చాణక్యునిదర్శించి యచట నాతఁడు చెప్పిన
విధమున తయారుచేసెనట. అంతియగాక జపానుసేనలు, జర్మనీ
సైనికదళముల నేర్పాటులననుసరించి యేర్పాటుచేయఁబడినవి.

జపానుదేశీయుల విద్యాభివృద్ధికై విస్తారముగ నమెరికావారు పాటుపడినప్పటికిని జపానువారికి నమెరికాదేశస్థులపై ద్వేషము మెండని లోకవిదితము. ఇందులో మాత్రము తప్పంతా జపానువారిది కాదని గుర్తెరుంగవలెను. మహాయుద్ధములో జర్మనీప్రభుత్వమే జయముగాంచియుండినయెడల జపానుప్రజలకు నెక్కువయానందముగా నుండేయుండెడిదని కొందరి నీతివిచక్షణుల యూహ. ఐరోపాఖండములో జర్మనీ ప్రభుత్వము నిరంకుశముగా వ్యవహరించుచు జపాను ప్రభుత్వమున కడ్డేమియును లేకుండ నాసియాఖండములో వ్యవహరించుటకు విడిచిపుచ్చియుండియుందురని వారినమ్మకము. అందులో నాశ్చర్యమేమియును లేదు. పరదేశములను జయించి, ముడిదినుసులను సంగ్రహించుచు వ్యాపారము నభివృద్ధిపరచుకొనుచు స్వార్థపరత్వముగల యేప్రభుత్వము ఈవిధమున నాచరించుటలేదు? లాభములను సంపాదించుటలోను రాజ్యముసంపాదించి విరివిచేయుటలోను ధర్మమునుపాటించిన ప్రభుత్వమిప్పటికిని ప్రపంచమునం గాన్పింపదు. ఈవిషయములో జపాను ప్రభుత్వమును నిందించుట క్రిస్టియను ప్రభుత్వములకు బాడిగాదు. క్రీస్తును వాని బోధలను క్రిస్టియను ప్రభుత్వము లెట్టుల నిరాకరించినవో యావిధముననె బుద్ధుని, బౌద్ధమత సిద్ధాంతములను జపానువారు కూడ నిరాకరించినారు. జపానుప్రభుత్వపు చర్యలను ఖండించుటకు క్రిస్టియను ప్రభుత్వములకు మాత్రమధికారము గాన్పింపదు.

జపానుప్రజలకు వారిచక్రవర్తియే దేవుఁడు. చక్రవర్తి కొఱకుఁ బ్రదెన్నికష్టములనైనపడుట కీర్తికరము తమకున్న సర్వస్వమునైన చక్రవర్తి శ్రేయస్సునకు సమముగనొడల ధారపోయుట ప్రజల ముఖ్యకర్తవ్యము జపాను దేశములో నెట్టి ఘోరకార్యమునైనజేసినను నేరస్థుఁడు "చక్రవర్తి కీర్తికొఱకు ఈనీకార్యముఁ గావించితిని" అని చెప్పినచో నట్టినేరస్థుని తీక్ష్ణ దండార్హునిగ చేయక విడిచిపుచ్చుదురు. ఈవిషయ మీసామర్థ్యము జపానులో సాంగ్రామికాధికారులు గావించిన కూనీలసంబంధములో సువ్యక్తమయినది. నిరపరాధులును శస్త్రహీనులును నగు చీనాదేశపు ప్రజలను వేలకొలఁది వధించుట యుక్తమని జపానువారు వాదించుచున్నారు. అందులకుఁ గారణముగ (1), చీనావారి ధైర్యస్థైర్యములను బోగొట్టి వారలను భయవిహ్వలులుగనొనర్చి వారియిచ్ఛకు లోఁబడునటులఁ జేయుననియు, (2), నిట్టిగుంపులను వధించుట జపానుసైనికులను పశుప్రాయులుగను నిర్దయులుగను, కఠినహృదయులుగను నొనర్చుటచే జపాను సైనికులు నెన్నికొనఁదగిన యుద్ధభటులుగఁ దయారుచేయఁబడుదురనియుఁ జెప్పుచున్నారు. సైనికుఁడు "తుపాకిఫైరను" సంస్కారము జరిగినపిదపగాని ప్రశంసనీయుఁడగు భటుఁడుఁ గానేరఁడని జపాను సాంగ్రామికాధికారుల నమ్మకము. అట్టియెడ నిరాయుధులగు ప్రజలను చెండాడుటలోను బేడిమూకలతో యుద్ధము సాగించుటలోను నవసరమైన యుద్ధతర్ఫీదు జపాను సైనికులకు కలుగునని నిశ్చయము. ఇట్టి వధలవలనను

యుద్ధమునందనను, జపానుసైనికులకుఁ బ్రాణహాని జరుగదు. ఇట్టి శిక్షను పొందుటవలన జపానుసైనికులు దిట్టలగు బంటులై చక్రవర్తికీర్తి నభివృద్ధిపరుప శక్తినిసంపాదింతురని వారు చెప్పుచుందురు, నిరపరాధులగు శస్త్రహీనులును వేలకొలఁదివధియించుటప్రశంసనీయమని జపాను సాంగ్రామికోద్యోగులు తలంచిచునటులఁగాన్పించుచున్నది. వారికి చక్రవర్తిపైనుండు భక్తి మెండు. భోజనముచేయుచు, నిద్రఁబోవుచు, సర్వసాధారణములయిన నరులు చేయు కార్యములనుజేయుచు జీవించుచు కాలగతిఁజెందు మానవుని దేవునిగఁ బూజించుట వింతయైన విషయమే. కాని చక్రవర్తియందు దైవత్వారోపణము కొలఁది కాలముక్రిందటనే గావింపఁబడెనని జపాను చరిత్రకోవిదులు నుడువుచున్నారు. బహుసంవత్సరములు చక్రవర్తి పరంపర దేశమును బాలించెననియు, రానురాను సామంతరాజులు బలిష్ఠులుకాగాఁ గేంద్రప్రభుత్వము బలహీనమయ్యెననియుఁ గాలక్రమమున నధికారములేని మఠాధిపతివలెఁ జక్రవర్తి తయారయ్యెననియు, "షోగనులు" అనఁగ సామంతప్రభువులలో బలవత్తరమైన వానిమూలమున నధికారము చలాయింప నారంభించెననియు, ఈ షోగనులననుసరించి "సమురై" అను యోధవర్గము వారలుండిరనియు, ఈసమురై తమతమ యధిపతుల ననుసరించి షోగనులలో నాధిపత్యమునకై కలుగు నంతఃకలహములలోఁ బాల్గొనుచుండిరనియు, 1853వ సంవత్సరములో "కామ్మడోర్ పెర్రీ" అనునాతఁడు జపానుప్రవేశించి పరప్రవే

శమునకు నవకాశము కలుగఁజేసినపిదప, నీ సామంతప్రభువుల పరిపాలనయంతరించి, బలవత్తరమైన కేంద్రప్రభుత్వము స్థాపింపఁబడినగాని, జపానురాజ్య మంతరించి, రూపమైనను లేకపోవునను భయముతో సమురైయున్న, వారి యధిపతులగు "డైమ్యోసు"లును తమవిశిష్టాధికారములను విడిచిపెట్టినఁగాని దేశము బాగుపడదని గుర్తించి, వారటుల 1868లో గావించిరనియుఁ జరిత్రకారులు చెప్పుచున్నారు. సమురైలు తమయధికారములను సిద్ధాంతములలోఁ దగ్గించుకొనిరి గాని, వాస్తవముగ పూర్వముకంటె నెక్కువ యధికారములను బలమును సంపాదించిరి.

ఇట్టిపరిస్థితులలో 'క్యోటో' అనుపట్టణమున దుర్బలుఁడై శక్తిలేక యధికారబహిష్కృతుఁడై కాలము గడుపుచుండిన చక్రవర్తి, తనపూర్వులనుండి బలాత్కారముగఁ దీసివేయఁబడిన యధికారము నొసంగఁబడి "టోకియో"లో సర్వాధికారములతోఁ జక్రవర్తి పీఠమున స్థాపింపఁబడెను. అప్పుడాతఁడు రాజ్యవ్యవస్థాపనములో నొక ముఖ్యమైనమార్పు నొనరించెను. ఆమార్పుప్రకారము మంత్రివర్గములో సాంగ్రామికమంత్రి, యుద్ధనావికామంత్రిపదవులు, సేనానాయకులకు, నావికాదళనాయకులకే యొసంగఁబడవలెను. అందుచే నీరెండుపదవులును సమురైవర్గమునకుఁ జెందినవారలకే యొసంగఁబడును, గాని యితరవర్గములవారికిఁ బ్రసాదింపఁబడవు. తోటి మంత్రులకుఁ గాని మంత్రివర్గమునకుఁగాని తెలియకుండ వారుచక్రవర్తితోఁ

దమతము విషయములఁగూర్చి నివేదించుకొను విశిష్టాధికార మొసంగఁబడిరి. ఈముఖ్యమైన స్థానములు సమురై వర్గము వారికి నేర్పాటుచేయఁబడి యుండుటచేఁ బ్రిధానులపదవు లీవర్గమువారి యధీనములోనున్నవి. ఈకారణమువలన 'చక్రివర్తి సాంగ్రామికపక్షము చేతులోఁ గీలుబొమ్మాయెను. చక్రవర్తికి సిద్ధాంతములోనున్న యసాధారణమైన యధికారబలమును వినియోగించుకొనుచునీసమురై వర్గమువారతిబలిష్ఠులైరి.

ఈతోలుబొమ్మచక్రివర్తిని సృష్టించిన సమురైవర్గము వారు వారి విశిష్టాధికారములను, నసాధారణ గౌరవములను గాపాడుచు వృద్ధిపొందుచునే యున్నారు. ఈచక్రివర్తి యుండుటచేతనే భిన్నభిన్న శాఖలవారలకుఁగల భేదములు, స్పర్ధలు, మాయమై దేశములో నైకమత్యము ప్రిబలియున్నది. చక్రివర్తి దేవుఁడుకాఁడు; మానవుఁడె అటులైనను రాజ్యపరిపాలనా విషయమున నాతఁడు కొన్ని విశిష్టాధికారములఁ గలిగియున్నాఁడని చెప్పుటకు నొక సంవత్సరముక్రిందఁ బ్రియత్నించిన నీతి చుంచువ్రను కూనిచేయుట కెన్నియో ప్రయత్నములను సమురై వర్గమువారు సలిపిరి. చక్రివర్తి సర్వలక్షణములుగల మానవుఁడేయని నిరూపించుటకుఁ బ్రయత్నించువారలెంతమాత్రము జపానులో నగ్గలేరు. చక్రివర్తి యధికారగౌరవములను నభివృద్ధిచేయ యత్నించుచు నాతని చుట్టుకొనియుండు సాంగ్రామికాధికారులు మాత్రము వాస్తవముగ నధికారము తమహస్తములలో నుండునటుల చూచుకొనుచుందురు. ఈవిధముగ

చక్రవర్తి యధికారగౌరవములను గాపాడుచు నున్నారై తమ యధికారమును నెక్కువ చేసికొనుచున్నారు.

ఇది యిట్లుండ మహాయుద్ధములో నాంగ్లేయ మిత్రమండలియే జయమును బొందుటయు, వార్సేలుసంధి జరుగుటయు, నంతరాతీయ సమితి స్థాపింపఁబడుటయు, జపానువారి కంతయిష్టముగా నుండలేదు. వారు గావించుకొనియుండిన యేర్పాటులకును, వారవలంబించుటకు నిశ్చయించుకొనిన నైతికవిధానమునకు వైచెప్పఁబడినవి యడ్డంకులయ్యెను. పరదేశముల నాక్రమించుకొని దుర్బలులగు ప్రజలను జయించి లాభములను బొంద నిశ్చయించుకొని యుండిన జపానుప్రభుత్వపు నుద్దేశములకు నంతర్జాతీయ సమితి నిర్మాణమును, తద్ద్వారా ప్రపంచములో శాంతినెలకొలుపుటకై యత్నమును దుర్బలులైన జాతుల రక్షించుటకై యాసమితి పూనుకొనుటయు, విరుద్ధములై యుండెను. ఐనను ప్రపంచమంతయు శాంతికై పరితపింప ప్రారంభించినది. కాఁబట్టి యప్పటిమట్టుకు లోకములో సమానముగా సంచరించుచుండియున్ను, యుక్తమైన సమయమువచ్చి యవకాశము దొరుకగానే చీనాను కబళించు నుద్దేశమును బయటపెట్టక యందులకు తగినచర్యను తీసికొనుటయున్ను, నిశ్చయించుకొని, వార్సేలుసంధిలో జపానువారు పాల్గొనిరి. అటుతరువాత "బ్రియండుకెల్లాగు ఒడంబడిక" "నవదేశసంధి" "నావికాదళముల తగ్గింపు గూర్చినసంధి" గావింపఁబడినవి. ఈ సంధులన్నియుఁ బ్రపంచక్షేమము నాడ

గూర్చుటకుఁ గావింపఁబడినప్పటికిని, యవి ముఖ్యముగఁ జీనా వారిని జపానువారి యమితాశలనుండి గాపాడుటకై గావింపఁబడినవని పండితుల యభిప్రాయము. ఈసంధుల యుద్దేశము జపానువారికిఁ దెలియకపోలేదు. వారువానిని లెస్సగ గుర్తెరింగి యుండుటచే నాసంధుల నమితముగా ద్వేషించిరిగాని, సంధిపత్రములలో సంతకము పెట్టకపోయినయెడల తమ యుద్దేశము లన్నియు యక్తముకాని సమయములో బయటఁబడునను భయముచే వారు వానినంగీకరించుచు చీనాదేశములో నెట్టి భాగమును నాక్రమించమని ప్రమాణపూర్వకముగా నొప్పుకొనుచు, సంతకములు చేసిరి. కాని సంధిపత్రములనగ చిత్తుకాగితపు ముక్కలేకదా? ఏప్రభుత్వము సంధిపత్రముల నవసరమైనచోట్ల నటులపరిగణింపలేదు? చక్రవర్తికీర్తి వ్యాప్తి కవసరమని చెప్పి యెట్టి సంధిపత్రములనైనను చిత్తుకాగితముల క్రింద పరిగణించే యట్టిశక్తి యధికారులకుఁ గలదని వారలకుఁ దెలియును. దేశక్షేమమునకు హానికలుగకుండ నుండు సమయముచూచి యట్టి సంధిపత్రములను నిరాకరించుచు జపానుతన యాశ్రిత కార్య సాధనముకై వేచియుండెను. సంతకములు చేసిన సంధిపత్రముల ప్రకారము నడచుకొనుటకు జపాను ప్రభుత్వ మెన్నడును తలచుకొనలేదు. నిజోద్దేశములను గప్పిపుచ్చి జపానుప్రభుత్వపు రాయబారు లన్నిదేశములలోను చీనాప్రజల కెట్టిహానియు చేయమనియును సాధ్యమైనంత వరకు వారి కుపకారములు చేయుదుమనియు, బ్రకటించిరి.

టలేదు. అమాయకులగు చీనాప్రజలు "బాక్సరువిప్లవ" కొలదికాలమునకు పూర్వమే జర్మనీవారాక్రమించిన మండలము "షాంటుంగు" జపానువారిచేతులలో నుండకుండ తిరిగి చీనా వారికి నిచ్చివేయఁబడునని చీనావారాశించినారు. అది వట్టి పిచ్చినమ్మకము — జపాను చేతఁజిక్కిన మండలము నదివిడుచునా? ఇట్టిస్వల్పవిషయములోఁ గూడ వార్సేలుసంధివలన నెట్టిలాభములేకుండ నుండడము చీనావారిని నిరుత్సాహులుగ నొనర్చి వారిమనసుల నొప్పిపెట్టునట్లు లొనర్చినది. జపాను క్లిష్టకోపము రాకుండ "ఇంగ్లాండు, ఫ్రాంసు" ప్రభుత్వములు జర్మనీకి షాంటుంగులోనుండిన హక్కులను జపాను ప్రభుత్వమునకిచ్చుచు రహస్యసంధిచేసినట. మహాయుద్ధములోఁ బొల్గానుటవలనఁ బూర్వమున జర్మనీవారు జ్యోతిశ్శాస్త్ర సంబంధములగు యంత్రములను చీనానుండి తీసికొనిపోయినవానిని తిరిగి చీనావారికి యిప్పించివేసినారు. ఇద్దానిని పెక్కింతకిందఁ బరిగణించినది ప్రపంచము.

చీనావారి హక్కులనుగూర్చి యేమైన యుపకారము చేయునుద్దేశముతో మిత్రమండలివారు సంచరించినచో చీనావారు నిరాశచెందకుండ యుండి యుత్సాహముతో దేశము నంతయు నొక్కటిగఁ జేయుటకై తీవ్రప్రయత్నములనసలిపి యుందురు. అటుగాక షాంటుంగుమండలములో జపానువారికి విశిష్టాధికారము లున్నవని మిత్రమండలి యంగీకరించుటతో [illegible] దేశములో నరాచకమును నశాంతియుఁ బొడగుట

ప్రారంభించెను. జపానుప్రభుత్వము ప్రాంతంగా నాక్రమించు
చుండగనే చీనాలో సాంగ్రామికాధికారులకు దురాశలు
జనించినవి. అందుచే వారిలోవార లాధిపత్యముకొఱకు యుద్ధ
ముచేయఁ బ్రారంభించినారు. అంతఃకలహములు దేశములోఁ
బ్రబలెను. జయమును తాత్కాలికముగాఁ బొందిన సేనానులు,
అమితముగాఁ బన్నుల విధించి ప్రజలను పీల్చిపిప్పిచేసి పెద్ద
పట్టణాలను దోచుకొనుటకుఁ బ్రారంభించిరి. ఎటుచూచి
నను దేశములో యుద్ధములె. ఎటుచూచినను ప్రజలయుఱ
జడలే; 1911 లో జరిగిన రాజ్యపరివర్తనము తరువాత యిరు
వదియేండ్లు దేశములో శాంతియనుమాట లేదు. ఏదోభాగ
ములో నెల్లప్పుడు యుద్ధమేదో జరుగుచునేయుండెను.

విదేశప్రభుత్వములు చీనావారికెట్టి యుపకారము
చేయ లేదన్నమాట ధృఢమైనది. ఉపకారములు చేయకపోయి
నను అంతఃకలహములను పెంపొందించి దేశమునకు హానిచే
యుటకు నవకాశముగాని యుద్దేశముగాని లేక తదితర ప్రభు
త్వములుండగా జపానుమాత్రము దేశములో నరాచకము, న
శాంతి పెంపొందేటట్లుమాత్రము సర్వయత్నములు చేయు
చుండెను. చీనా సాంగ్రామికాధికారులలోఁ గొందరకు
లంచములనిచ్చియు, మఱికొందరను తర్జించియు, తదితరు
లతో యుద్ధము నుజేసియు, జపాను తలపెట్టినకార్యము ను జయ
ప్రదముగా సాగించుచునే యుండెను. ఇట్టియల్పయుద్ధము
లలో మహాయుద్ధ పరికరములను వినియోగించుచు శిక్షగాని

యుద్ధపరికరములుగాని లేని చీనావారిసేనలను నోడించినపిదప సులభముగా నెన్నడును జపానుసైన్యము లట్టిమండలములను విడిచిచనుటలేదు జయముపొందినపిదప నీసేనానులు జపాను వారి కిచ్చవచ్చినషరతులతో సంధిగానిస్తేనేగాని జపానువారి సేనలట్టి మండలమును విడిచిచనుటలేదు. ఇట్టిసంధిపత్రములను సాతికము చేసినవారలు చీనాప్రభుత్వ ప్రతినిధులుగారసి తెలిసికొనవలయును. ఐనప్పటికిని యెట్టియల్పసేనాని యాత్మలాభమునపేక్షించుచు నేసంధిసూత్రమునకు నొప్పుకొనినను నా షరతులన్నియు దేశమునంతట నెప్పటికి బంధించునని జపాను ప్రభుత్వమువారు దృఢముగా చెప్పుచుండెడివారు. ఈసంధులన్నియు ముఖతః జరిగినవేగాని లిఖితములో నిమిడ్చబడి యుండలేదు. అట్టివన్ని రహస్యముగా [illegible]గాని బాహాటముగా జరిగినవిగావు ఇట్టిసంధిషరతుల [illegible] జేసికొని జపానుప్రభుత్వమువారు తమకు చి[illegible] హక్కులు సంక్రమించినవని చెప్పుచున్నారు.

మంచూచక్రవర్తుల పరిపాలనము 1911 లో రాజ్యపరివర్తనమువలన నంతరించినతరువాత ప్రజలలో నుత్సాహము స్థైర్యమున్నగు గుణములు కొలదికాలము మాత్రమే యుండినవి. రాజ్యపరివర్తనకారులు సాధించదలచి చెప్పినయే కార్యమును సఫలీకృతముకాలేదు. స్వాతంత్ర్యమునకై పోరాటముసలిపి స్వాతంత్ర్యమును సంపాదించి రన్నమాటయే గాని స్వాతంత్ర్యమువలన కలుగులాభమేమియు వారికి సంక్రమించ

లేదు. వారు సంపాదించినది వాస్తవమైన స్వాతంత్ర్యముకాదు. మంచూ చక్రవర్తుల పరిపాలనములో స్వాతంత్ర్యము లేక బానిసత్వముండినను దేశములో ప్రజలుమాత్రము ఒకరీతినైన శిక్షలోనుండి శాంతముగా జీవితములను గడుపుచుండినారు. స్వాతంత్ర్యము సంపాదించినతరువాత సంతతపూర్వమునుండిన నిర్బంధములు శిక్ష లంతరించి జీవితములో ననిశ్చయము ప్రబ్లి యెడతెగని మార్పు సంభవించుట ప్రారంభించినది. చీనావారి ప్రబోధమునకు మూలాధారములైన సంస్థాపనము లంతరించినవి. పారంపర్యాయముగా వచ్చుచుండినవాని విద్వేషించుచు నూతనమైనవానికై యత్యంతాభిలాష కనుబరచుటలో చీనా వారవలంబించుచుండిన "కన్ఫ్యూషియస్" యొక్క సిద్ధాంతములనుకూడ నిరాకరించినారు. తాత్కాలికముగా నాసిద్ధాంత సంపూర్ణ నిరాకరణము జరిగినది. తరువాత నామతములో నున్న మంచిని కొంతవరకుదీసికొని తిరిగి యాచరించడమునకు ప్రయత్నించినారు.

ఇట్టినైతిక, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, విషయములలో దారితెన్నుగానక ప్రజలు తీవ్రార్తియుండ, సాంగ్రామికాధికారులు దేశాధిపత్యమునకై పోరాటములు సలుపుచు నరాచకమును వృద్ధిపొందించుచుండ "సన్ యట్ సెన్" మహాశయుం డేర్పాటు చేసిన "కుమిన్ టాంగ్" అను నొక్క రాజకీయపక్షమే యుండెను. ఆ రాజకీయపక్షము మంచూచక్రవర్తుల పరిపాలనము నంతమును పొందించే రాజ్యపరివర్తనకార్యముల

నిర్వహించుటలోనే తర్ఫీదుపొందిరి కాని రాజ్యపాలనా కార్యములను నడపించుటలో శిక్షనుబొంది యనుభవముకలవారు కాకపోయెను. మొట్టమొదట రాజ్యపరివర్తనకార్య మేర్పాటుచేసికొన్నటుల సంచరించిన యీపక్షమువారు దేశపరిపాలనలోను నూతన ప్రజాపాలనమును స్థాపించి నడపించుటలోను ననుభవముపొందినవారై యుండియుండుటగాని కారణాంతరముల వలన మంచూసామ్రాజ్య పరిపాలనమనుకొనిన దానికంటె చాలకాలము ముందరే యంతమునకువచ్చెను. పూర్వపు పరిపాలనావిధానము, పరిపాలనగావించే సజ్జును మాయమయ్యెను. నూతనవిధానము పుట్టలేదు. క్రొత్తసజ్జు తయారుకాబడలేదు. లంచములనుదినేప్రభుత్వము దుష్టమైనదైనను నరాచకము కంటె మేలనియును, లంచగొండులైన దుష్టసాంగ్రామికాధికారుల కఠినపరిపాలనకంటె వరమనియు చీనావారు తెలిసికొనినారు.

ప్రజలలో 'నైకమత్యముకొఱకు "కుఓమింగ్ టాంగ్" సంఘముయొక్క సభ్యులెన్నికష్టములు కలుగుచుండినను సరకుగొనక పాటుబడుచునే యున్నారు. వారికి సమస్తమైననాయకులు లేకపోవుటయేగాక, వారి రాజకీయ వ్యవహారానుభవము అత్యంతస్వల్పమై యున్నది. అనేకమైన భావములు కలిగి యుండి సమయములోబెట్టుటకై యొకదానిపిదప నింకొకదాని యవలంబించుచునే యుండిరి. దేశము ప్రజలందరిలోను నైకమత్యము గలుగునటుల జేయుట వారి ముఖ్యకోర్కెలు. ఇట్టి

మైకమత్యమును సంపాదించుటకై వారికుండిన భిన్న భిన్నాభి
ప్రాయములను వెనుకకుఁ బెట్టియే సంచరించుచుండెడివారు. విదేశ
ప్రభుత్వములకు విశిష్టాధికారముల నొసంగిన "అసమానసంధు
లను" రద్దుచేయుటకుఁ బాటుపడుచునే యున్నారు. ఈ రెండు
ఫలములను సమకూర్పగలిగిన యుద్దేశము లనెవ్వఁడు ప్రకటించి
నను వానిననే కులననుసరించి చనుచుండెడివారు. "సన్ యట్
సెన్" అను రాజ్యపరివర్తనము గావించిన మహాశయుని ననుస
రించి చనుచుండిన వారలకు నొకకష్టము సంభవించుచుండెను.
ఉద్దేశము లెప్పటికప్పుడు మారుచుండుటచేఁ గార్యసాధనము
యొక్క విధానము జరుగుచుండుటలేదు. పైజెప్పిన రెండు
వాసి ఫలములు "సామ్యవాదము" ననుసరించి గలుగునని కొంత
కాలముగనఁబడెను. అందుచే సామ్యవాదమునకై ప్రచారము
గావించువారికిని దేశము స్వాగతమునొసఁగుటయె కాక సామ్య
వాదసంబంధములైన సంఘముల నేర్పరచినది. సామ్యవాదసిద్ధాం
తము దేశములోఁ బ్రబలి తదితర పరిపాలనా విధానములను
తోసిపుచ్చునేమోయను భయము చీనాలో వ్యాపారముసాగిం
చుచుండిన విదేశీయులకు పుట్టనారంభించింది. అమెరికా,
యింగ్లాండు, ఫరాంసు ప్రభుత్వములవారీ సిద్ధాంతము దేశ
ములోఁ బ్రబలకుండ తీవ్రప్రయత్నములను సలిపియే యుం
దురు. వీరి విరోధప్రచార మెంతవరకు సామ్యవాదమును దేశ
ములోఁ బెరుగకుండఁ జరిపినదో మనకుఁ దెలియదు. చెప్పుట
కును గష్టము. 1926లో సామ్యవాదమును దేశము సంపూర్ణ

ముగా నంగీకరించి యనుకరిస్తుందేమో యన్నటుల కనిపించినది. రష్యాదేశములో "సోవయట్" పక్షము ఐకమత్యమును కలుగజేసి యరాచకమును లేకుండజేసినది; కనుక యాసిద్ధాంతములను నవలంబించినచో చీనాదేశములోకూడ నట్టిఫలములే కలుగుననునాశయా ప్రజలలో బుట్టుటచే సామ్యవాదమును ప్రజలనుసరించిరికాని సామ్యవాద సిద్ధాంతములపైనుంచు నమ్మికముచే వారటుల గావింపలేదని కొందరిమతము. ఏదియెట్లున్నను రాజకీయపక్షమును స్థాపనచేయుటతప్ప వేరెట్టి లాభమునుసామ్యవాదము ననుసరించుటచే చీనాకుకలుగలేదు.

చీనాదేశములో నరాచకము పెరుగుచున్న సమయములో కొంతమంది యువకులు, దేశసేవా పరాయణులగువారలు, నీతికోవిదులు, వ్యవహారములలో బాల్గొనుటకు బ్రారంభించిరి. వారిలో ముఖ్యముగా జెప్పదగినవారు సర్వసేనానాయకుడు "చయంగ్ కై షేక్" "డాక్టరు హూ" రాజస్వశాఖామంత్రి డాక్టరు. జ టి. వంగ్" అమెరికా సంయుక్తరాష్ట్రములకు రాయబారి. వీర లనేకవిషయములలో నేకాభిప్రాయము కలిగి చీనాలో నైకమత్యము కొరకు నిరంతర మెడతెగనిపాటు పడుచుందురు. ఈకార్యసిద్ధి పొందుటకు బూర్వము వారు సాంగ్రామికాధికారులతో యుద్ధములు చేసి యంతఃకలహముల నణచివేయవలసివచ్చినది.

తదితర సాంగ్రామికాధి కారులవలెగాక యీమహా సైన్యములను సుశిక్షితములుగ నుంచుటయేగాక, యాత్మశిక్ష

ణముకూడఁ గాపించుకొనవలసియుండెను. అతఁడాక్రమించు కొనుచుండిన మండలపు ప్రజలనుండి పన్నులను వసూలుచేయు చుండెనుగాని, యవి తదితర సాంగ్రామికాధికారుల పన్నుల వలె భారమైనవి కాకుండ యుండెను. సేనలచే దోపిళ్లు చేయింపక యన్ని వర్గాలవారి యామోదమునకై పాటుపడుచుండెను, చీనాలో నైకమత్యము సాధించుటకొఱకు పాటుబడుచున్నా నని యాతఁడు ప్రకటించుచుండెను. గాని, దేశప్రజలలోను విదేశీయులతోనుకూడ వానిమాటలయందు నమ్మకము లేకుం డెను. కానిరాను రానునీవీరాగ్రేసరుఁడును, నాతని యనుచరులును కూడ "సన్ యట్ సెన్" సిద్ధాంతముల నవలంబించినటుల స్పష్టపరిచెను. సెన్ మరణానంతర మాతనిసిద్ధాంతముల ననుస రించుట యంత కష్టతరమైన కార్యమై యుండియుండలేదు. సన్ యాట్ సన్ మరదలను వివాహమాడి సెన్ యట్ సెన్ కుటుంబముతో సంబంధము కలుగఁజేసికొనెను. "చయాంగ్ కైషెక్" యొక్క భార్య విద్యావంతురాలు, మేధావి. వీరు ముగ్గురక్కచెల్లెండ్రు. వీరిలోఁ బెద్దయామె సన్ యట్ సెన్ యొక్క సతీమణి. రెండవయామె చయాంగ్ కైషెక్‌ను వివా హమాడెను. మూఁడవయామె రాజస్వశాఖామంత్రిని వివాహ మాడెను. వారిసోదరుఁడు టి. వి. సూంగ్. ఈతఁడు నవీన చీనాదేశ పునర్నిర్మాణములో నెంతయోని పాటుపడ్డ దేశ భక్తాగ్రేసరుఁడు.

దేశములో భిన్నభిన్న మండలములలోఁ గొన్నికొన్ని సంఘములు కొందరు నాయకులుఁ కూడ దేశములో నైకమత్యముఁ గొలుపఁ బాటుబడుచుండినను వారందఱుకలసి పాటుబడుటకు వీలుమాత్రము కల్పించుటలేకయుండెను. సన్ యాట్ మరణమునకు కొలదికాలముక్రిందట తానవలంబించిన పక్షము వారధికారస్థానము నుండి తొలగింపఁబడుటచే దేశమునువిడచి పారిపోయి జపానులో జీవింపవలసివచ్చెను. చియాంగ్ అతిసౌలభ్యముతో నాంకింగు యుద్ధములో జయముగాంచగనే దుష్టులు కొందరాతఁడు బలవంతుఁడగు నేమోయను భయముచే నాంకింగుపై దండయాత్రి విదేశీయులను చెండాడుటకై గావింపఁబడినదని మాయచేసి నిరూపణచేయుటచే ఆరుగురు అమెరికనులు చంపఁబడినారు. ఇందుతో విదేశీయ విరోధప్రవృత్తి యమితముగాఁ బెరిగిపోయినది. కొంతకాలము చీనా దేశములో సీప్రచారము యమితముగాఁ జరిగినది. కొంతకాలము చీనా దేశములో సీప్రచారము తత్సంబంధమైన గలిభీలుతప్ప వేరేమియు లేకయుండెను. కాని యీప్రవృత్తియు సామ్యవాదము వలె నడుగంటినది. విదేశీయులకు విశిష్టాధికారములు చీనావారి దౌర్బల్యమువలననే కలుగుచున్నవనినిశ్చయము. ఇప్పుడు కొన్నివిదేశముల వారనుభవించుచున్న విశిష్టాధికారముల ననుభవించుచున్నంతవఱకు విదేశీయులపై ద్వేషముండకమానదు. విదేశీయు లదిగ్రహించుదురు గాక!

చేయుంగ్ సేనాని బలముగలవాఁడని జపానువారు విదేశీయులందరిలోను ముట్టమొదట గ్రహించినారు. కాంటనుపట్టణమునుండి యుత్తరమునకుఁ బోవుచు "హాంకో" "నాంకింగ్" ప్రదేశముల సాంగ్రామికాధికారుల నోడించి యధికారభ్రష్టులుగ నొనర్చి పురాతన రాజధానియగు పెకింగునకుఁ బోవుచుండగా "చయుంగ్" బలిష్ఠుఁడగు నేమోయను భయముచే జపానువారు "ట్సినాన్ఫూ" పట్టణములో జపానువారి ప్రాణములను గాపాడేమిషపై సేనలనుంచినారు. స్వదేశములో నైకమత్యము లేకయె తదేకదీక్షతోఁ బాటుబడుచుండిన చయుంగ్ సేనాని విదేశీయులతో యుద్ధమునసాగించుట కదియింక సమయముకాదని తలంచి పెకింగునకుఁ బోవకుండా తిరిగి నాంకింగుచేరెను. అందువల్లనే 1927వ సంవత్సరము నుండియు నాంకింగు పట్టణమె చీనాకు రాజధానియయ్యెను. ఈ చయుంగ్ ప్రభుత్వాధీనములో చీనాదేశములోనున్న 18 మండలముల లోను 5 మాత్రమే యుండెను. ఐననీమండలములవలె నతి ఫలవంతములైనవియును సిరిగలవియును, ప్రోత్సాహము గలిగి వృద్ధికై పాటుబడుచున్నవియునైన ప్రజలతో నిండియున్నవి.

చయుంగ్ పరిపాలన చేయనారంభింపఁగానే ప్రభుత్వ వ్యవహారములను కొనసాగించడములో నిదివరకెన్నడును దేశములోఁ గాన్పింపని సామర్థ్యము బయటపడినది. చయుంగ్ ముఖ్యముగా సేనానాయకుఁడయ్యు పరిపాలనలో సాంగ్రామికోద్యోగులను వినియోగింపక నానాకార్యములను తెలివితేట

లతోఁ గాపించేపౌరులచేతనే చేయింప నారంభించినారు. ప్రజారోగ్యము, రాజబాటలు, విద్య, వరదలవల్ల నుపద్రవములు కలుగకుండఁజేయుడము, అడవులసంరక్షణ మున్నగు జనోపయోగకరములను, దేశకల్యాణమును గావించునట్టి శాఖలను రాజకార్యములను చక్కంబెట్టగలిగిన పౌరులకే యప్పచెప్పెను. ఇదివరలోఁ బాల్గొనిననీతి విద్యాధురంధరులు, రాజకార్యదక్షులు, చయాంగ్ చే రాజ్యపరిపాలనములో వినియోగింపఁబడుచువచ్చిరి. పౌరులును రాజ్యపరివర్తన కార్యములను విడనాడి రాజ్యపరిపాలన కార్యములలో నత్యంతోత్సాహముతోఁ బాల్గొనుట కారంభించిరి. అయినను దేశములో నంతఃకలహములు, యుద్ధములు, మాత్రమాగలేదు. యుద్ధములు చేసి, యైకమత్యము సంపాదించుటకంటె సామోపాయముననె యట్టి యైకమత్యమును సంపాదించుట మంచిదియని యెంచి నాంకింగు ప్రభుత్వము స్వతంత్రితో వ్యవహరించుచున్న మండలాధీశ్వరులతో సామోపాయముగా వ్యవహారములుసద్దుపాటు చేసికొనుచుండెను. ఈయుపాయమును వినియోగించుటలోఁ గొన్నిచోట్ల జయమును, గొన్నిచోట్ల నపజయమును సంభవించినవి. ఇంతలో 1937లో జపాను ప్రభుత్వము ప్రారంభించిన యుద్ధములో నైకమత్యము వృద్ధిపొంది చీనాలో నిదివరలోలేనట్టి స్నేహభావములు, బంధుభావములు, సాంగ్రామికాధికారులలోను, మండలాధిశ్వరులలోను బెరిగినవి.

చీనాదేశము ప్రబోధములో చాల వెనుకనున్నదనియు జపానువారి స్నేహభావములు నమ్మదగినవి కాకపోయి యుండుటచేతను "కుమింస్ టాంగ్" యొక్క యధికారులమితోత్సాహవంతులై యతితొందరతో జనాభ్యుద్ధరణమును గావించుటకు సర్వప్రయత్నములు చేయనారంభించిరి. జపానువలన ప్రమాదము సంభవించునని వారికిభయము ఐకమత్యమునకు లోగి బలమును సాధించినగాని వారు జపానువారిచేత గబళింపబడుదురని వారికి దెలియకపోలేదు. సేనలు బలవంతులైనవియుండినంతమాత్రమున దేశక్షేమము సమకూర్పబడనేరదని వారలకు దెలియును. కావున నీయధికారులు జాతిపునరుద్ధరణకార్యమును తీవ్రముగా జేయుటకు బ్రారంభించినారు. అధికారులు ప్రజలపన్నులను తిరస్కరించి ప్రజల కెట్టియుపకారము చేయరని మంచూ చక్రవర్తుల కాలములో సిద్ధాంతమైనది. పన్నులు వసూలుచేసి యాడబ్బును తిరస్కరించుచు నొక వంతెనగాని యొకబడిగాని యొక యాసుపత్రిగాని నిర్మించుట యెప్పుడును లేదు. ఒకప్పుడు మరిచిపోయి యుద్యోగియెవ్వడైనను సత్కార్యమును గావించినచో నాధర్మకార్యమును మెచ్చుకొనుచు వాని స్మారకచిహ్నముగ నొకయార్చి కట్టుచుండెడివారు అని యొక చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. నూతనాధికారులుకూడ కొంతడబ్బు నపహరించినను నంతయు నపహరింపక యత్యల్పకాలములో దేశములో నిదివరకెన్నడులేని రోడ్లను వేయించిరి. రోడ్లు లేకపోవుటచేతను ప్రజలు దూర

ప్రయాణముల సౌలభ్యముతోఁ గొలదికాలములో చేయునవకాశములు లేకుండుటచేతను మండలము మండలములకును విద్వేషభావములును మాండలిక భావములును నుండెడివి. ఇవి యేదేశములో నైకమత్యము లేకుండఁబోవుటకు ముఖ్య కారణములు. అందుచే రాజబాటలును రైళ్లును టెలిగ్రాఫును వేయించిరి. ఈకార్యము లతిత్వరితముగ జరిగినవి. వారములలో జరుగు ప్రయాణము దినములలోఁ గావించుట ప్రారంభించినారు. మోటారులుపోయే రోడ్లు తయారుకాఁగానే చవుకైన బస్సులు నడువ మొదలుపెట్టినవి. కూపస్థమండూకముల వలెనుండిన ప్రజలు ప్రయాణికులై తెలివితేటలను సంపాదించుట మొదలుపెట్టిరి. 1912లో టీంట్సెన్ - పుకౌ రైలుబాట నిర్మింపబడగానే షాంఘై మొదలు పెకింగునకుఁబయన మైదు దినములలోఁ గావింపఁబడుచుండెడిది. 1934లో నుదయ భోజనము షాంఘైలోఁ జేసికొని సాయంకాలభోజనమునకుఁ బెకింగునకు చేరుటకు వీలయినది. దీనికిఁగారణము విమానములను దేశములో విరివిగా నుపయోగించుటయేయని నెఱుంగవలెను. పూర్వము "షాంఘై"నుండి "స్జెచూయెన్" మండలరాజధానియైన "చెంగ్టు" నుత్రికముచేయుటకుఁ బదునేడురోజులు పట్టెడిది. ఇప్పుడు షాంఘైలో నుదయమున టపాలో నుత్తరము వేసినచో నాసాయంకాలములోపల నాయుత్తరము చెంగ్టుచేరుచున్నది. ప్రభుత్వోద్యోగులు వివిధ దూరస్థమండలములను నచటియధికారులతో నామండల సంబంధములైన విషయముల చర్చించు

కై విమానములపైనే యెగరచుగాఁ బ్రయాణములు సాగించు చున్నారు. పూర్వము నూరుమైళ్ల దూరములో నుండిన ప్రదే[illegible]లకు సైతము కేంద్రప్రభుత్వమువారు హుకుముల జారీ చేయుంపవలెనంటే వారములకొలది దినములు పట్టుచుండెను. ఇప్పు డున్నచో ప్రతి జిల్లామేజిస్ట్రేటునకు రేడియోలు నిచ్చుటచే కేంద్రప్రభుత్వపు హుకుములు, ప్రకటనలు, రాజకీయ విషయములు కొలది నిముషములలో నందఁజేయఁబడుచున్నవి.

వాషింగ్టనులో నొకసభ జరిగినది. ఆసభను వాషింగ్టను సభయని యందురు. ఆసభలోనే షాంటింగు మండలమును చీనావారికిఁ దిరిగి యిచ్చివేసేటట్లు జపానువారు నిర్బంధింపఁ బడిరి. ఆనిర్బంధముతో జపానువారు చీనావారికా మండలము నిచ్చివేయవలసివచ్చినది. ఆసభలోనే సుంకములను విధించుటలో మార్పులు చేసినారు. వార్సేలు సంధివలన సంక్రమించు లాభములలోఁ గొన్నిలాభములుఁ యీసభలోనే గావింపఁబడినవి. అప్పటినుండి చీనా విషయములో జపాను ప్రభుత్వపు నైతికవిధానము మార్పుచెందినది. ఈవాషింగ్టను సభలో జరిగినషరతులు జపానులోని సాంగ్రామిక పక్షమునకపజయముకల్గినదైనను వర్తకులకు మాత్రమానందకరమయ్యెను. శాంతియుతమును సంపదతోఁ దులతూగుచుండు చీనా జపాను వర్తకులకెక్కుడు లాభకరమగుననువారివిశ్వాసము సత్యమైనదే యని గుర్తెరుంగవలయును. జపానువర్తకులు తమ సాంగ్రామికాధికారులు జపాను నార్థికశ్రేయస్సునకు జపాను చీనాలో

రాజ్యము సంపాదింపవలయునని గావించుచుండిన ప్రచారమును నమ్మియుండలేదు. సాంగ్రామికాధికారుల రాజకీయ విధానము సాంగ్రామిక శాఖాఖర్చులు అంతులేకుండా పెరగడముబట్టిచూచి యుక్తమైనదికాదని జపానువర్తకులనమ్మకము. అయినను వారిచేయిదములను ఖండించిన తమకేమిప్రమాదము సంభవించునేమోయని వారి భయము.

వాషింగ్టను సభలో జపానువారి మనోరథములకు భిన్నములయిన షరతులంగీకరింపఁబడగానే జపాను సాంగ్రామికాధికారులు తమ సాహసకార్యాలను వెనుకకుఁబెట్టి చీనా ప్రజలందరేకమై తెల్లవారి నామోదింపక వారివిశిష్టాధికారములను నెదుర్కొనినఁగాని ప్రమాదము సంభవించునని ప్రచారము ప్రారంభించిరి. ఈప్రచారములో విస్తారముగా రాయబారులు, రాజకార్యదక్షులు పౌరులుకూడఁబాల్గొనిరి. అత్యధికముగా నీప్రచారమును సాగించుట మొదలుపెట్టిరి గాని ఫలమేమియు లేకపోయినది. "ఆసియాఖండ మాసియాఖండపు వాసులకే యుండవలెను" అని జపాను గావించుచుండిన ప్రచారము చీనావారికి భయము కలిగించినది. అట్టి పరిస్థితులలో జపానువా రాసియావాసులందఱిపై నధికారము చలాయించెదరని వారిభయము. సయామునుకూడా యీప్రచారముచేసి లోంగదీయఁ బ్రయత్నించెనుగాని జపాను ప్రభుత్వమునకు నిందు జయము కలుగలేదు. ఫిలిప్పైను దేశస్థుల నిట్టిప్రచారముచేసి తమపక్షమునకుఁ దీసికొన ప్రయత్నించిరిగాని వారి

ప్రయత్నము లిందుఁ గొనసాగ లేదు. సింగోళ్లు, చీనావారు, మలయా దేశస్థులు, హిందూ దేశస్థులు, సింహళ దేశ బౌద్ధులు మున్నగువారందఱు తెల్లవారి యధీనములో నున్నారనియు, వారలందఱు ఆసియాఖండవాసులలో బలిష్ఠమగు ప్రభుత్వముతోఁగలసి పాటుబడిన శత్రుబానిసత్వమంతరించుననియు, ప్రచారము గావించిరిగాని యందువలన లాభమేమియు లేకుండెను.

అమెరికా ఖండములో "మన్రోసిద్ధాంతము" అనునదియొకటియున్నది. అట్టి సిద్ధాంతమునే బలమైన జపానువారాసియాఖండమునకుఁ బ్రయోగించిన బాగుండునని ప్రచారము సాగించినారు. దుర్బలులగు నాసియాఖండపు వివిధజాతుల వారలకుఁ జపానువారే రక్షకులైయుండుట మంచిదని యీ సిద్ధాంతముయొక్క ముఖ్యోద్దేశము. ఇది కోడిపిల్లను రక్షణకై నక్కకు నొప్పచెప్పుటవంటిదని పండితుల యభిప్రాయము. ఎన్నివిధముల నెంతడబ్బును వెచ్చించి గావించి నీప్రచారము నిష్ఫలముకాఁగా సాంగ్రామికాధికారులు శౌర్యరంగమునకు దిగినారు. మాటలెంతకాలము చెప్పినను లాభములేదనియు, ననుకొనిన పనులుచేసిననేగాని లాభము కలుగదనియు, సాంగ్రామికాధికారులు నిర్ణయించినటులఁ గాన్పించుచున్నది. ప్రపంచ మేమనుకొనిననేమి? చీనాలో ననుకొనిన పనులుసాగించిననేగాని జపాను బాగుపడదనివారు దృఢముగా నిశ్చయించుకొనిరి. టనకప్రభువు ప్రధానిగానుండి 1927లో "మంచూరియా మంగోలియా మండలాలు చీనా సంపదను సంపాదించుటకై

యాక్రమింపఁదగు ముఖ్యస్థానములు. అదిజరిగినపిమ్మట హిందూ దేశము, దక్షిణ సముద్రములోనుండు ద్వీపములు, ఆసియా మైనరు, మధ్యాసియాఖండము మనముజయించి యటుపిమ్మట నైరోపాఖండమును జయించుదము" అని జపాను చక్రవర్తికి నొక నివేదికను సమర్పించినాఁడట. అది నిజమో యబద్ధమో గాని "మంచూరియా" "మంగోలియా" మండలములలో గలిభీలుజరిగి యశాంతివృద్ధి చెందినయెడల మన ప్రాంతములలో నున్న విశిష్టాధికారములకు భంగమేమైన సంభవింప నున్నపుడు యేమిజరిగినను జపానుప్రభుత్వమువారు వానిని కాపాడుదురు' అని టనకుఁడు ప్రకటించిన దానినిచూచినచో జపానుప్రభుత్వపునుద్దేశములు సువ్యక్తములగును. చీనాగూర్చి జపానువారి యుద్దేశములగూర్చి యెట్టియనుమానముండిన నట్టిది 1931లో జపాను వారిచర్యలఁబట్టి మాయమై వారియుద్దేశములుబయటఁబడెను. మంచూరియా మంచూచక్రవర్తుల జన్మస్థానము. ఈప్రదేశమును జపాను రష్యాప్రభుత్వము లెంతయేని కోరుచు యుద్ధములుకూడ గావించినారు. ఈరెండు ప్రభుత్వములుకూడ నీ మండలములను వేరుచేసి ప్రత్యేక ప్రభుత్వముకల మండలము క్రింద నేర్పాటుచేయుటకుఁ బ్రయత్నించిరి గాని యేకారణము వలననో యయ్యది 1931 వరకుఁ జీనాప్రభుత్వము నధికారము క్రిందనే యుండెను. చీనాప్రభుత్వమువారేయందు సుంకములు వసూలుచేయుచు తపాల టెలిగ్రాఫులను నడుపుచుండెడివారు. 1911 లో జరిగిన రాజ్యపరివర్తన సమయములో నీమండలము

"చంగాట్సోలిని" సేనాని చేతులలోఁబడెను. అతఁడు చీనా సాంగ్రామికాధికారు లందరిలోను నతిబలవంతుఁడు.

రష్యాజపానుయుద్ధము జరుగుచున్న సమయములోఁ బెద్ద దొంగలగుంపునకు యజమానిగా చంగ్ యుండెను. ఈతనికి ధనసహాయమును యుద్ధపరికరములనిచ్చి జపానుసాంగ్రామికాధికారులు రష్యనులను గొరిల్లాయుద్ధముగావించుచు బాధపెట్టునటులఁ జేసిరి. ఇంతలో రష్యాజపాను యుద్ధమంతముకాఁగానే చంగ్ మొదటవృత్తినే యవలంబించినాఁడు. ఇంతలోఁ జీనారాజ్యపరివర్తనము జరుగఁగానే చంగ్ తనదొంగలనందర నొకసైన్యముక్రిందఁజేసి యితరదొంగల గుంపులను నణఁగఁద్రొక్కి మంచూరియాలోనుండిన యల్పసాంగ్రామికాధికారులను తరిమివేసి "మక్డెన్" అను పట్టణమును రాజధానిగఁజేసికొని మంచూరియాను పరిపాలనముచేయుట ప్రారంభించినాఁడు. మొదటజపానువారి సహాయమునను, నుపదేశములతోను చంగ్ ఇట్టియున్నతపదవిని యలంకరింపఁగలిగినను రానురాను జాతీయపక్షము చీనలో నభివృద్ధిచెందగనే పూర్వమిత్రులైన జపానువారియుపదేశముల నిరాకరించి యాంగ్లేయులతోను, నమెరికనులతోను, స్నేహముచేయుట మొదలుపెట్టినాఁడు. 1928లో చంగునకును జపానువారికిని వైషమ్యము కలిగినది. 1928లో జూన్ మాసములో చంగ్ పెకింగునుండి మక్డెనునకు తిరిగి వచ్చుచుండఁగా బాంబుప్రేలి యాతఁడు ప్రయాణము చేయుచుండిన రైలుబండి ముక్కలయినది.

చంగ్ మరణించినాఁడు. ఈప్రమాదము సంభవించునపుడా రైలుపట్టాలు జపానుసేనల సంరక్షణాలోనేయుండెను. అట్టిసేనానాయకులకుఁ దెలియకుండ బాంబుచట పెట్టఁబడలేదని తెలిసినవారనుచున్నారు.

చంగ్ మరణించినపిదప మంచూరియారాజ్యము నాతనికుమారుఁడైన "చంగ్ హ్సూయె హ్లాలియంగ్" పరిపాలించుట ప్రారంభించినాఁడు. ఒకసంవత్సరము కాకమునుపె యాతఁడు జపానువారిని ధిక్కరించి జాతీయప్రభుత్వమునకు నధీనుఁడై వారియాజ్ఞలను శిరసావహించుచుండెను. యథేచ్ఛతోఁ దనకుండిన యధికారములను, ప్రభుత్వమును వదలుకొని జాతీయ ప్రభుత్వపుసేనలలో సేనాధిపతిపదవినలంకరించుటకంగీకరించెను. తనముఖ్యకార్యస్థానముపైని మంచూరియా ప్రభుత్వకార్యస్థానముపైని జాతీయపతాకము నెగురవేయించుట ప్రారంభించినాఁడు. జాతీయప్రభుత్వపు ప్రచారకులు మక్డెన్ చేరి జపాను చీనావ్యవహారములలో జోక్యము కలుగఁజేసికొనకూడదని ప్రచారమును సాగించుట ప్రారంభించినారు. ఈ ధమున జపానుప్రభుత్వమును నిరసించడము జపానువారికి బాధకరముగానుండెను. ఈతఁడు తమకుశత్రువని యెంచి జపానువారు యుక్తమైన సమయముకొఱకై వేచియుండిరి. ఇంతలో "కుఓమిన్ టాంగ్" తిరిగి మంచూరియాలో నధికారము చెలాయించుట ప్రారంభించునరికి జపానువారికి నిట్టివిశేషాధికారము లుండకూడదని స్థూలలక్ష్యులసంఘము ప్రచారము

తీవ్రముగాఁ గావించుట మొదలుపెట్టెను. ఇందుచే జపాను వారిపై ద్వేషము ప్రజలలో మిక్కుటమైనది. జపానువారు నూతనసాంగ్రామిక ప్రభువుని తొలగించి యధికారము తిరిగి తమచేతులలో నుంచునటులచేయుట కొకమిషకొఱకు వేచి యుండిరి. దక్షిణ మంచూరియాలో జపానువారికిఁ జెందియున్న యొక రైలుబాటలో నెవరోకొందఱు చీనావారు పట్టాలను పెకలించిరట! సెప్టెంబరు 18వ నాటిరాత్రి 10 గంటలవరకు నీసంభవము జరుగకపోయినప్పటికిని యానాటిరాత్రి జపాను వారు మంచూరియాలోనున్న చీనా సేనలన్నిటికిని యుపాయాగ మగు మందుగుండు తదితర యుద్ధపరికరములనిలువచేసియుండే యాయుధగారములనుచీనా సేనలుండే శారకులను జపానుసైన్యములు ముట్టడించి యాక్రమించిరి. ఉదయమగునదికి మంచూరియాలోను, కొరియాలోను నుండు జపానువారి సేనలన్నియు దక్షిణ మంచూరియాయంతయు వ్యాపించి దేశము నాక్రమించెను. దక్షిణమంచూరియాను జయించి తాము బయటకుఁ బ్రభుత్వమును నడిపించుటమాని వేపి యొక తోలుబొమ్మలాంటి వానిని రాజుగాఁ జేసిరి. ఈసంభవములు జరుగుటకు నొకసంవత్సరము పూర్వమునుండి జపానన్ని వ్యవహారములను సిద్ధపరచుచుండెను. మంచూచక్రవర్తులు రాజ్యపదభ్రష్టునిగాఁ గావింపఁబడినపుడు "హెన్రీపూయీ" అను బాలకచక్రవర్తి పెకింగుపట్టణములోనే యుండిపోయెను. ఈచక్రవర్తి సింహాసనమును వదలుకొనుటకు షరతులలోనొకటి. చక్రవర్తి కుటుంబమునకు

తగిన భరణమునిచ్చుట కంగీకరించిరి. రాజ్యపరివర్తనకారులు ఈషరతుప్రకారము ప్రజాప్రభుత్వము నంచరింపలేదు. ఈపదచ్యుతుండైన చక్రవర్తికి యుక్తములైనమర్యాదలు గౌరవములు జరిగింపఁబడలేదు. ప్రజాప్రభుత్వముయొక్క తప్పులివి. ప్రజాప్రభుత్వమొప్పుకొన్నషరతుల ప్రకారమునాచరింపలేదు. రాజ్యపదభ్రష్టుండైన చక్రవర్తియు ప్రభుత్వముపై నెట్టికుతంత్రములు పన్నకుండనుండుట ఒకషరతు. అందులకువిరుద్ధముగా రాజ్యమును తిరిగి స్వీకరించునుద్దేశముతో మంచూ సామంతప్రభువులతోఁ గలిసికొన్నితంత్రములు పన్నుట ప్రారంభించెనాతఁడు. అది తెలిసికొని ప్రభుత్వము వారీరీతిని సౌఖ్యాలుకట్టినప్రాసాదములో కులాసాఖైదులోనుంచిరి. ఇట్టిపరిస్థితులలోఁ జీనా ప్రభుత్వమున్ను, పదభ్రష్టుఁడైనచక్రవర్తియు ద్వేషించుకొనుచుండినసమయములో జపానుప్రభుత్వము వారీతనిపట్టిరి. మంచూరియాయె యీతని పూర్వుల పుట్టినిల్లు. ఆదేశమునకు రాజుగానగుట చీనాప్రభుత్వముపై కసిదీర్చుకొనుటయెగాక తనకుండిన యాశలను నెరవేర్చుకొన్నట్లగును. అట్టియుద్దేశములతో జపానుప్రభుత్వము చెప్పినటుల చేయుట కొప్పుకొనెను. "టీన్సిన్‌లో" నుండిన "పూ"ని తీసికొనిపోయి జపానువారు మంచుకూ రాజ్యమును నిర్మించి యందునకు రాజుగఁజేసిరి. ఈవ్యవహారము గూర్చి నిష్పక్షపాతముగా "ఇంగ్లాండు" "ఫరాంసు" "జర్మనీ" "ఇటలీ" "అమెరికా సంయుక్తరాష్ట్రముల" ప్రతినిధులొక పంచాయితీగాఁ బరీక్షల సలిపిరి. ఈపంచాయితీదారులైనను భేదాప్రాయ

ము సూచింపలేదు. జపానుగావించిన దౌర్జన్యమును యేక ముఖముగా ఖండించి రాపంచాయితీదారులు.

యుద్ధమని ప్రకటించకుండా 1932లో జపానువారు షాంఘైలో చీనావారితో యుద్ధముచేసిరి. ఇందులో నొక చిత్రకథ కలదు. జపానువారియొక్క సేనలకును, నౌకాదళము నకును, గొన్ని విరోధభావములున్నవి. వానిలోవారికి నొకరి కంటెనొకరు చక్రవర్తికి సేవచేసితిమని యనిపించుకోవలెనని కోరికలుండుటచే వారికిసరిపడుటలేదు. దేశములో మొదటిసేన లనునావికాదళముల నేర్పాటుచేయునప్పుడు సేనలలోనధికారులు "చౌషు" జాతికిచెందినవారినుండి యెన్నుకొనఁబడి తరిఫీదు చేయఁబడిరి. అటులనే సట్సుమజాతినుండి నావికాదళము లోనుండు యధికారు లెన్నుకోబడిరివారు. ఈరెండు తెగల వారికిని యసూయభావములున్నవి. మహాయుద్ధములో జపాను వారు తీసికొన్న భాగము నావికాదళ సంబంధముతప్ప వేఱొట్టి సంబంధముకలదిగనై యుండలేదు. వారి నా వి కా ద ళ ము "ట్సింగ్టో" పట్టుకొని జర్మనునోడఁనుండి ప్రమాదము జరుగ కుండ సముద్రబాటలను కొన్నిటిని గస్తీచేసిరి. వార్సేలు సంధిలో నిదివరలో జర్మనీ యధీనములోనుండిన ద్వీపములపై నధికారమున్ను, "షాంటింగు" నాక్రమించుకొనుట కంగీకరిం చుటయును జపానుచక్రవర్తికీర్తివృద్ధికి గారణములయ్యెనని యీ నట్టియభివృద్ధి నావికాదళమువలననే కలిగినదని సే న ల కుఁ గొంత మనోబాధపట్టుకొనెను. ఇంతలో మంచూరియాలో

ప్రాణనష్టము గావింపకుండగనే జయముగాంచుట సేనలమెప్పొ నకుం గారణమైనది. ఈవ్యవహారములో నావికాదళమున కెట్టి ప్రసక్తియు లేకుండనుండెను. జపానుదేశములో నిట్టిఘనకార్యము సాధించినందులకు సేనానాయకులకును వ్యూహములను పన్నినవారలకును స్తోత్రపాత్రములు గావింపంబడెను. అందుచేం గొంతవఱకు నావికాదళమునకు మనస్సులో విచారము పట్టుకొనెను. వారు కీర్తిసంపాదించుటకై తగినసమయము కొఱకు వేచియుండిరి. అందులకనువగు సమయము కలిగినది.

మంచూరియాదేశమును జపానువారాక్రమించు సరికి చీనాదేశము నందంతటను జపానువారు తయారుచేయు వస్తువులను కొనకుండ నాంక్షపుట్టి పెరిగినది. ఈయాంక్ష యున్నను జపానువారిని కొట్టడముగాని చంపడముగాని యెవ్వరునుచేయలేదు. ఇంతలో 1932 జాన్యువరి 1వ తేదీని షాంఘైలో చీనావారి ఫాక్టరీయెదుట నొక చిన్నగల్భ చీనావారికిని కొంతమంది జపానువారికిని జరిగినది. ఆగల్భలోనిద్దరు జపానువారికి గాయములుదగిలినవి. వారిలో నొకఁడు చనిపోయెను. ఇద్దైనరెండు రోజులలో జపాను బేషిమూకలొక చీనావారి కర్మాగారమునకు నిప్పుపెట్టి తగులబెట్టిరి. గలిభిలేకుండ నుండుటకై యచటకుంజనిన ముగ్గురు చీనాపోలీసువారిని జపానువారు కొట్టిరి. వారిలోనొకఁడు మరణించెను. జపానువారిలో ముగ్గురికి దెబ్బలుతగిలెను. వారిలో నొక్కఁడు మరణించెను.

ఆతక్షణమే జపాను నావికాదళనాయకుఁడు మహాషాంఘైమేయరుని యైదుషరతులను చేయుమని నిర్భంధించుచుఁ గోరినాఁడు. వానిలో మూఁడు మేయరుక్షమాపణ వేఁడుకొనుచు నేరస్థులను బంధీకృతులుగఁజేసి శిక్షింపవలయుననియు జరిగినహానికై పరిహార మీయవలయుననియు; జపాను విరుద్ధమగు భావములు చూపింపకుండ నుండేటట్లు గావింపవలయుననియు; జపానువారికై విరోధభావములు పెంపొందించు సంఘములన్నియు నిర్మూలముగావింపబడవలెననియు; మిగిలిన షరతుల సారాంశము. ఈషరతులలో మొదటిమూఁడింటినికొంత వరకు నెరవేర్చెదననియు; మిగిలినవానిగూర్చి తానేమియుఁ జేయఁజాలననియుఁనాతఁడు దెలిపెను. వాస్తవముగాజపానువారు చీనాదేశములోఁ గావించుచున్న దుండగీడుతనము చీనావారిలోఁ బ్రబలకోపమునున్ను విరోధభావములనున్ను పుట్టించినది. వీనినడఁచి వేయుట యధికారులకు వీలైనపనికాదు. ఈజవాబు చేరినకొలది ఘంటలలోనే నావికాదళనాయకుఁడు "షియాజోవా" వార్తాపత్రికలో నీక్రిందిప్రకటనను గావించెను.

"మహాషాంఘై పట్టణపుమేయరు కాలయాపన చేయకుండ జపానువారి షరతులను నంగీకరించుచు నాచరించినఁగాని నావికాదళనాయకుఁడు జపాను సామ్రాజ్యాధికారములను శ్రేయస్సును కాపాడుటకై యవసరమైన చర్యను గావింపనిశ్చయించియున్నాఁడు."

ఈప్రకటననుజూచి మేయరచటనుండిన యాంత్రసంఘము లనన్నింటిని తమకార్యములను కట్టిపెట్టుడని యాజ్ఞాపించుచుం దనహుకుమునకు విరుద్ధముగా సంచరించువారిపై పోలీసుచర్య చేయం బ్రారంభించెను. అట్టిసంఘముల కార్యస్థానములు బలాత్కారముగా మూసివేయంబడెను. కాని యిందుతో జపాను నధికారి యూరకొనలేదు. ఆరాత్రి 11 ఘంటలకు షాంఘై సమీపములోనుండిన చీనావారిసేనలు దూరముగాం బంపివేయబడుచు, రక్షణకై గావించిన యేర్పాటులన్నియు రద్దుచేయంబడయవలయునని యాజ్ఞాపించినాండు. ఈయాజ్ఞ రాత్రి 11.15లకు మేయరునకుం జేరినది. జపానువారి సైన్యములు 11-45 ఘంటలకుం గదలుటప్రారంభించినవి. ఆరాత్రియే 12 ఘంటలకు బండి ఫిరంగులు చిన్నఫిరంగులు యంత్రతుపాకులు పేలడము ప్రారంభించినవి. జపానువారి విమానములు పట్టణముపై నెగిరినవి. ఒకమాసము యుద్ధముజరిగినది. చీనావారు వెనకతీయకుండ పోరాడిరి. చీనావారి యాస్తులు బుద్ధిపూర్వకముగా నాశనము చేయంబడినవి. 4274 మంది పౌరులు యమాంతికమునకుంబోయిరి. కానిపించనివారి సంఖ్య 10040. చీనావారిబలమును తక్కువ చేయడమువల్లనో లేక తమబలమును నెక్కువ చేయుటవల్లనోగాని యుద్ధములో మొదటంబాల్గొన్న 300 జపానుసైనికులు ఏమియు చేయలేకపోయిరి. తుదకుంగొంత కాలమైన పిదప నుభయపక్షముల వారలలోను వేలకొలది మృతిజెందిన పిదప షాంఘైమేయరు చేయుట కంగీకరించిన

మరతులకంటె నెక్కువలాభములను జపానువారు పొందకుండగనె సంధిగావించుకొనిరి. ఈదుండగీడు తనమువలన జపానుపొందిన యధికలాభ మేమిటంటే షాంఘైసామీప్యమునుండి చీనాసేనలు పంపివేయఁబడుటయును పనికిరాని "ఫూనంగ్" దుర్గము యుద్ధ పరికరములు లేకుండఁ గావింపఁబడుటయును. ఇందువలన జపానుపై విరోధభావము లంతరించుటకుమారుగ నవి యత్యంతము నభివృద్ధిచెందినవి.

దేశములో నైకమత్యముండునటుల చీనావారిలో నాయకులెంత ప్రయత్నించినను, వారిప్రయత్నములు నిష్ఫలములగుచుండెను. కాని జపానువారిబాధలు ప్రారంభమై రాను రాను వారిదౌర్జన్యము లధికములగుచున్నకొలది చీనావారిలో నైకమత్యముకూడ యభివృద్ధి చెందుటకు ప్రారంభించినది. జపానువారిపై ద్వేషము చీనావారిలో నంతులేకుండ పెరిగెను. పరులను ద్వేషించుటయే ప్రజలలో నైకమత్యముండుటకుఁ గారణమై యుండకూడదు. కాని చీనాలోమాత్రమది నైకమత్యమునకు ముఖ్యకారణమైనది. చీనాలో ఒకలక్ష మంది జపానువారు జీవించుచున్నారు. వీరు భిన్నభిన్న లౌకికవృత్తుల నవలంబించి జీవనములను గడుపుచున్నారు. చీనా దేశమున గర్వముతోను, డాబుదర్పముతోను, సంచరించుచు, చీనావారు తమప్రజలైపోయి రన్నట్లు ప్రవర్తించుట తోడనె చీనావారికి జపానువారియందుండు విద్వేషభావములుమితిదాటినవి. న్యాయస్థానములలో జపానువారేమైన వ్యాజ్యములలోఁ

దగులో నియున్నపుడు చీనా ప్రజ్వావాదులను బెదరించి గెలుపుపొందుటకు యత్నించుచుందురు.

ఇట్టిమంటలు మనములను కాల్చివేయుచుండగా .రాను రాను చీనాదేశమందుండు జపానువారికిని చీనావారికిని దెబ్బలాటలు జరుగుట మొదలుపెట్టినవి. ఇట్టిగల్భేలలో జపానువారు కొద్దిమంది-అయిదేండ్లలో బందెగ్రిందుగురు కూడా కాలేదు - చచ్చిరి. ఈగల్భేలకు ముఖ్యముగా గారణము చీనావారు యుద్ధముచేసేటట్లులప్రోత్సహించుటయనిగ్రహించవలెను.ఎన్ని మోస్తరులుగా జపానువారుకయ్యమునకుఁగాలుదువ్వుచుండినను చీనాప్రభుత్వము శాంతముతో సంచరించుచు దేశసంరక్షణమును వృద్ధిపరచుకొంటూ వచ్చినది. జపానువారి కూనీజరిగినపుడు జాగ్రత్తతోఁ బరిశీలించుచు నేరస్థులు దొరికినపుడు వారిని శిక్షించుచుండెసిది. షాంఘైలో జీవించుచుండిన విదేశీయులకుఁ బ్రజలకు జపానువారియందుండు భావములు తెన్నగఁదెలియుటచేఁ గూనీలు గల్భేలంతస్వల్పముగా జరుగుట చూచి యాశ్చర్యపడుచునే యుండెడివారు. షాంఘైలోనుండు జపాను నావికాదళమువారు చీనావారి నతినీచముగాఁజూచుచు నతితిరుచుగాఁ దమబలమును కనుపరచుచుండెడివారు. ఎడతెగకుండ తుపాకులు మొదలగు నాయుధము లిమడ్చబడిన మోటారుబండ్లు బాంబులు బొరుశాయలుగ షాంఘైవీధులలోఁ బోవుచుండును. జపాను నావికాదళమువారు మోటారుబండ్లను గుంపుగుంపులుగనెక్కి పోల్చుట కనువగునట్టులుగాఁదుపాకుల

పరీక్షచేయుట ప్రారంభించినారు. ఈబాధలవలన యావ్యాపారులకుఁ బ్రజలు పోవడముమానివేసినారు. అందుచే వానివ్యాపారము పోయినది.

ఒకనాఁ డొకపదేండ్లప్రాయపు కుఱ్ఱవాఁడు, జపాను నావికాదళమునకొకటి మోటారుబండ్లలోఁ బోవుచుండగా చూచి ముక్కునులుపుకొన్నాఁడట. ఆతత్క్షణమే బండి నాపి భీతిచెంది పారిపోవుచున్న బాలుని వెంటతరుమ ప్రారంభించి వానినిపట్టుకొని నావికాస్థానములో ఖైదిగానుంచివేయుగా, నా బాలునితండ్రి జపానుఅధికారులుగార్కి క్షమాపణ నతిదీనముగా నొసంగగా వానినివిడిచిపుచ్చిరి.

ఒకబట్టలుతికేవాఁడు గొడుగుమార్గమున చీనావస్త్రకుండొకఁడు పరివారములోఁబెట్టినాఁడు ఆసూర్యుని తెరచిన గొడుగు. ఇదిజపానుచక్రవర్తిని నిరసించడమని చెప్పుచుఁ గొంతమంది జపానునావికు లొషాపులోఁ బ్రవేశించి వస్తువుని నవ్వునంతా ధ్వంసముచేసినారట. జపానువారి జాతీయచిహ్నముదయసూర్యుఁడు. కావున తెరువఁబడిన గొడుగు సూర్యకిరణములను నడ్డివేయును. కాఁబట్టి యుద్దిచిహ్నము జపానుచక్రవర్తికి మరచుటకు వీలులేనియవమానమని జపానునావికాదళమువారు నిశ్చయించినారు. చీనావారి యాడపిల్లలైనను నిట్టి యవమానములనుండి తప్పింపఁబడియుండలేదు. ఒకగౌరవకుటుంబమునకుఁ జెందిన యాడపిల్లనొకజపానునావికాదళమువారు వారియజమానితోఁ జెప్పనైనచెప్పకుండ గట్టిగాఁ గొట్టినారట.

విదేశీయులనుగూడ వారవమానించుచుండిరని చెప్పి విదేశీయులు బలవంతములైన ప్రభుత్వపు ప్రజలై యుండుటచే గోపము కనబరచుచున్నారుగాని వానిని మనము గమనింపవలసిన యావసరము లేదు.

షాంటుంగునుతిరిగి చీనా వారికిచ్చివేయుటచే జీనావారి నాయకులలజడి యేమియులేకుండ దేశములో నైకమత్యము నంపాదించి దేశము నభివృద్ధిపరచుటకుఁ దగిన యవకాశము కలిగినదని సంతసించినారు. చీనా సైనికులు లక్షలకొలదియుండుటచే ప్రభుత్వమునకు వారివలన కలిగిన భార మమితమైపోయినది. అద్దానిని తగ్గించుకొనవలెనను చింతతో సైనిక దళముల విదారణముచేసి సైనికులసంఖ్యను తగ్గించుటకై తీవ్రప్రయత్నముల నలుపుట ప్రారంభించినారు. జాతీయ ప్రభుత్వముయొక్క యధికారమునకులొంగియుండియు సాంగ్రామిక ప్రభువులు కూడ స్వంత సైన్యములను తయారుగా నుంచుకొని వారిభక్తి విశ్వాసములకుఁగాను కేంద్రప్రభుత్వమును సేనలపోషణకై డబ్బివ్వవలయునని కోరుచుండెడివారు. ఈవిధమున కోరినవారలలోఁ గొంతమంది కోరికలు సబబైనవేగాని తదితరుల కోరికలుమాత్రము బెదరించి డబ్బపహరించు నుద్దేశమేయని నిశ్చయము. ఈ సాంగ్రామికాధికారుల బలము వారి సైనికదళములపైనాధారపడియుండుటచే వారలు కేంద్రప్రభుత్వపు సైనికులసంఖ్యను తగ్గించుప్రయత్నములకు నడ్డంకులను కలుగఁజేయుచుండెడివారు. ఈ సంయుక్తము లగు ప్రతీపకారకములైన సంరస్థాములు జరుగుచుండగా మం

మంచూరియామండలమును జపానువా రాక్రమించుటచే సేనలను విదారణముచేయక సేనలను తయారుగానుంచుటయే దేశమునకు శ్రేయస్కరమని చీనాప్రభుత్వమునకు నిశ్చయమైనది. సైనికులసంఖ్యను తగ్గించుటకుమారుగ నున్నసేనలనుంచుచు వారిని నూతనాయుధములతోను యంత్రసామగ్రితోను ముందు నటులచేయుట ప్రభుత్వమునకు విధిలేకవచ్చినది. యుద్ధవ్యవహారములలో నిపుణులైన జర్మనుయోధుల ననేకులను వినియోగించుట ప్రారంభించినది చీనాప్రభుత్వము. చీనావారి సాంప్రదాయిక సైనికదళములలోనుండిన చేతకాని యోధులందరు వారివారి యుద్యోగములనుండి తీసివేయబడినారు. వారికున్నకొద్ది విమానచాలకులు వైమానికయోధగణమును చక్కగ యుద్ధముచేయుటకు దగినవారలుగ జేయుటకై తీవ్రప్రయత్నములు సలిపిరి. ఈవ్యవహారములలో నిపుణులైనవారి నమెరికాఖండమునుండి తెప్పించి వారిసహాయమున "హాంగ్చౌ"లో నొక వైమానికపాఠశాలను స్థాపించినారు ఇవ్వఁగలిగిన వృత్తినైపుణ్యమును విమానములు తయారుచేయించుటలోను విమానములువాలుటకై తగినస్థలముల నేర్పాటుచేయుటలోను వినియోగింపఁబడినది. సేనలయుపయోగమున కవసరమైన బాటలను నిర్మించుటకు నధికప్రయత్నములు గావింపఁబడి ప్రభుత్వపులాటరీయొకటి నెలకొల్పఁబడినది. చియాంగ్ కైషేక్ గారి జన్మదినోత్సవమునాఁడు విమానములను కొనుటకై ప్రజలుత్సాహముతో చందాలిచ్చినారు. కైషేక్ గారి స్వంతయువ

యోగార్థము ముస్సోలిని యొక్క విమానమును దాఖలు చేసినాడు 1932 నవంబరులో జాతీయార్థిక సంఘమేర్పరుపబడి రాజబాటల నిర్మాణము, పంటకాలువలు, ప్రజారోగ్యము, విద్యా గ్రామోద్ధరణము, సంబంధములయిన ప్రభుత్వాంగము లేర్పాటుచేయబడినవి. చీనాలో నెటుచూచినను క్రొత్తబడులు ఆటమైదానములు, పరిశుభ్రములైన వీధులు, కాన్పించుచుండెను. చీనాయుద్యోగులలో నిదివరకులేని ధర్మాచరణము (అనగ లంచములు పుచ్చుకొనకుండ తమవిధులనిర్వర్తించుట) చూపరుల కాశ్చర్యము కలుగజేయుచుండెను. దేశములో నొక క్రొత్తజీవనము, శక్తి, ఉత్సాహము, వైలక్షణ్యము, గాన్పించుచుండెను. అయినదా కేంద్రములోను చీనాలో గాన్పించిన యభివృద్ధి మగుచ్చుట నంతస్వల్పకాలములో గాన్పింపలేదు.

ప్రజలనుండి పన్నులవసూలుచేయుటలోను, రాజస్వాన్ని ఖర్చుపెట్టుటలోనుగూడ నధికారులతిన్యాయముగా సంచరించుట ప్రారంభించినారు. ఇందులకు ఉదాహరణముగా క్రింది విషయమును మనము గమనింపవచ్చును. మంచూరియా చీనా వారి యధీనమునుండి తప్పింపబడినను 1929లో కంటె నుప్పు నుండి వచ్చుపన్ను 1934లో నైదువంతులకంటె నెక్కువైనది. దొంగతనముగా సుంకమునివ్వకుండ వస్తువులను తీసికొనిపోయి యమ్ముట చాలవరకు గిట్టుబడుటచేత దేశపునర్నిర్మాణమునకు వచ్చిన రాజస్వము నశిపోయియుండవలసినదే. ఈసమయములోనే 8000 కంటె నెక్కువసంఖ్యగల మాండలికపన్నులు

తీసివేయఁబడినవి. ఈపన్నులు చిరకాలముండి దేశములో నుండినవే. ఇట్టిపన్నులవలననే వాణిజ్యమభివృద్ధి కావలసినంత వరకుఁగా లేదు.

1935లో నాణెముల విధానము సంపూర్ణముగా సంస్కరింపఁబడినది. పూర్వము చీనా నాణెములు వెండితోఁ జేయఁబడినవైయుండి చీనావారి కాగితపునోట్లుకూడ నాణెములపై నాధారపడియుండుటచేత వెండిధరలు పెరిగి తగ్గుచుండుటచే విదేశ వ్యాపారము కొంతజూదమువలె నుండెడివి. చీనాప్రభుత్వము తదితర దేశప్రభుత్వములవలెఁ దమ నాణెములకు యుక్తములైన మూలాధారములనొసంగుటయా? లేక యెట్లుండుటయా? యని వివాదము కలుగుచుండెను గాని జాతీయ ప్రభుత్వ మారీతిగఁ జేయుట యవసరమని నిశ్చయించిరి; చీనా డాలరుయొక్క విలువ యమెరికాడాలరు బ్రిటిషువారి సవరను పైని యాధారపడియుండి విస్తారమైన మార్పులేని సంబంధము కలిగియుండునట్లు ప్రభుత్వముచేఁ గావింపఁబడినది. ఘోరమైన యుద్ధము జరుగుచున్నను చీనాడాలరు విలువలో నట్టి మార్పులు జరుగుటలేదు.

చీనా జాతీయప్రభుత్వము గావించుచుండిన సంస్కారములు సత్కార్యములన్నిటికిని జపానువారడ్డుపెట్టుట ప్రారంభించినారు. నాణెములవిలువ స్థిరముగాఁ జేయుటకుఁ జీనా ప్రభుత్వము ప్రయత్నించుచుండ, జపానువారు షాంఘైలో జపాను నాణెములనే నుపయోగింపవలెనని పంతముపట్టినారు.

నాణెములవిలువ తగ్గిపోకుండనుండుటకై యట్టివిషయమున పక్షేపసంరక్షణార్థము చీనాప్రభుత్వము వెండి యెగుమతి కూడ దని నిర్బంధముచేయునెడల జపాను ప్రభుత్వమువారుతమరక్షణ యిచ్చుచు వెండి యెగుమతిజరిగేట్లు చేసిరివారు. విదేశీయుల బ్యాంకులలోనుండిన వెండిని చీనా వారి నూతనకాగితపు నోట్లనుతీసికొని యిచ్చివేయుమని చట్టముగావింపగా జపాను వారి బ్యాంకులుతప్ప తదితర బ్యాంకులన్నియు నటులనే గావించెను. చీనాప్రభుత్వముయొక్క బ్యాంకులలోనుండిన వెండిని టీన్ట్సినునుండి తీసికొనిపోకుండ జపానువారడ్డుపెట్టిరి.

అంతర్జాతీయ సమితివారు వివిధములయిన ప్రజాక్షేమకరములగు రాచకార్యములలో నిపుణులగువారలను చీనాయభివృద్ధికై పంపుచుండ సాంకేతికసహాయము చీనావారికిసమితి చేయుచున్నదనిచెప్పుచు జపాను కొందుకగిలినది. అమెరికా ప్రభుత్వము 50,000,000 డాలర్ల విలువగల గోధుములు పత్తి యువ్వగా చీనాప్రభుత్వమునకునియ్యగ నది సాంగ్రామిక ప్రయోజనమునకయినయువ్వని జపానుప్రభుత్వము వారు గలిభీచేయుట ప్రారంభించినారు.

మంచూరియా స్వాధీనముచేసికొనినపిదప నుత్తరచీనా యాక్రమణపదకై జపానుప్రభుత్వమాలోచించుట మొదలుపెట్టెను. జపాను, కొరియా, మంచుకో, ఉత్తరచీనాభాగములుకలిసి ప్రభావకముగా నొక కూటమిగాగావింపబడవలెనని చెప్పుట ప్రారంభించి [illegible] జపానులోనుండు రాజకీయశాస్త్రులుమాతనొక వ్యాఖ్యానించు

చీనా కేంద్రప్రభుత్వమును ధిక్కరించు స్వతంత్ర ప్రభుత్వములు జపానువారి యుపదేశమునుపొందుచు వారిచెప్పుచేతలలో నుండినచో జపానువారికిచాలు. మాసములకొలది యీ యైదు మండలములలోనుండు సాంగ్రామికప్రభువులను నెడతెగకుండజపానుప్రభుత్వపు టున్నతోద్యోగులంటిపెట్టుకొనియుండిరి. స్వతంత్రరాజ్యములను స్థాపించుటకొరకు పితూరీలు గావించినచో ధనసాహాయ్యము, తదితరసాహాయ్యముకూడ చేసెదమని చెప్పినారు. జపానువారు కోరినదేమనగా నార్థికవిషయములలో జపానువారియుపదేశము ననుసరించి చనుటయె.

ఇన్నిప్రయత్నములు సలిపినను నొక్కనిచును తప్ప నేరొకడు జపానువారికి చీనావారిలో దొరకలేదు. వాడు హోపీమండలములో వసించుచుండినవాడు. ఆదుష్టుడు కేంద్రప్రభుత్వము ననవరతము నిరాకరించుచుండును. అతడొక జపానుయువతిని వివాహమాడెను. చియంగ్ కైషెక్ అనిన నాతనికి ననూయ. హోపీమండలములో గొన్నిజిల్లాలలోని ప్రజలు 1935లో స్వాతంత్ర్యమును ప్రకటించిరి. ఇంతలో గాలహూపన్ యేమియుచేయక జపానుప్రభుత్వ మీనూతన స్వాతంత్ర్యరాజ్యము నొప్పుకొనుచు నుపదేశకులనచటకుబంపి సేనలనుకూడ బంపెను. ఇట్టిదేశద్రోహులచే గావింపబడిన నూతన రాజ్యప్రభుత్వము నంగీకరింపనూనంగీకరింపలేదు. అంగీకరింపకుండనుండనూలేదు చీనాప్రభుత్వము. ఈ దేశద్రోహులం

నేమిచేసినను జపానువారితో యుద్ధము తప్పదని నిశ్చయించి వారితో వ్యవహారములు నడిపించుటకొరకు కేంద్రప్రభుత్వము మాండలికసంఘమును నేర్పాటు చేసినది.

చీనా దేశమును స్వాధీనముంచు నుద్దేశముతో తదితర ప్రభుత్వములు నల్లమందు మున్నగు మత్తుమందుల వ్యాపారమును మాన్పివేయుట కమితప్రయత్నములు సలుపుచున్న సమయములో జపానువారందులో పాల్గొనుచున్నటుల నటించుటయే కాక వారే యీమత్తుమందుల వ్యాపారమును బాహాటము చుండెడివారు. జపానువారు మత్తుమందు లుపయోగింపకుండ సర్వప్రయత్నములను గావించుచు జపాను ప్రభుత్వమువారు వాని తయారుచేయుచు కావలసిన విదేశీయులకు నందులో ముఖ్యముగా చీనావారికి మత్తుమందులనమ్ముట ప్రారంభించినారు. అంతర్జాతీయసమితివారు గావించిన నివేదికప్రకారము మత్తుమందులను దొంగతనముగా నమ్మకము చేయు వ్యాపారము నూటికిం దొంబదిపాళ్లు జపానువారిచేతనే గావింపంబడుచున్నదని నిశ్చయమగుచున్నది.

ఈనూతన స్వాతంత్ర్యరాజ్యస్థాపనలో జపానుప్రభుత్వపు టాడక్రింద చీనాలోనికి చీనాప్రభుత్వమువారు పుచ్చుకొనుచున్న సుంకములలో సగముమాత్రమే పుచ్చుకొనుచు జపాను వర్తకులు దేశములోనికి వస్తువులను దిగుమతిచేయుట ప్రారంభించినారు. ఇదివరలో దొంగతనముగా దేశములోనికి వస్తువులను దిగుమతి చేయుట యతిరహస్యముగా గావింపంబడుచుండెడిది. ఇప్పుడా

రహస్యము పోయి బాహాటముగా నట్టి దిగుమతి చేయుట ప్రారంభ
మయినది. సుంకముల రక్షకభటులు ఓటులదొంగితనముగా వస్తువుల
దిగుమతి చేయువారల నడ్డుకొనగా జపాను సైనికులును, పోలీసు
వారును, నట్టి చీనా ప్రభుత్వపు రక్షకభటులను కొట్టి తరిమివేయుట
యేగాక చంపివేయుటకూడ గావించుచుండెడివారు. ఇంతలోఁ
బ్రమాదవశమున నొకకొరియా దేశస్థుఁడు దొంగతనముగా దిగు
మతి చేయువాఁడు గాయములనుబొంద జపాను ప్రభుత్వము చీనా
ప్రభుత్వమును నిర్బంధించి రక్షకభటులను నిరాయుధులుగనొన
ర్చునటులఁ జేసినది. అందుచే సుంకరక్షకభటులవలన నెట్టిలాభము
లేకుండనుండెను. ఇది యైనపిమ్మట "ట్సింగ్టో" సమీపమున చీనా
వారి సముద్రములో నొక యోడ దొంగతనముగా సుంకములీయ
వలసిన వస్తువులను సుంకములీయకుండ తీసికొనివచ్చుచుండ
నొక చీనావారి సముద్రతీర రక్షకనావ యద్దానినడ్డుకొనెను.
ఆయోడ ఫిరంగులను ప్రభుత్వపుటోడపై పేల్చెను. ప్రభుత్వపు
టోడకూడ ఫిరంగులను పేల్చెను. దొంగపని చేయుచుండిన
యోడ జపానువారి పతాకము నెగురవేయుచుండెను. ఆ జెండా
గుండ ఫిరంగిగుండు పోగా నది కన్నము పడెను. అందులకై
రక్షకపుటోడను నడిపిన యుద్యోగులందరును వారి పనులనుండి
తొలగింపఁబడుటయేగాక చీనాప్రభుత్వము జపాను ప్రభుత్వము
వారిని క్షమాపణ కోరుకొనవలయునని నిర్బంధము చేసిరి.
ఇందుతోనూరుకొనక జపాను ప్రభుత్వపు పతాకము నెగుర
వేయు నోడలనడ్డిన మొదలు జపాను ప్రభుత్వము వారిత్తానిని

హోడవాంగలక్రింద భావించి గుండ్లువేల్చి ముంచివేసెదమని ప్రకటించినారు. ఈశాసనమును అమలులోనుంచుటకై జపాను వారి యుద్ధనావికాదళము చీనాసముద్రములో నెక్కువ చేయఁబడినది.

ఈపైఁజెప్పిన రెండుకార్యములవలనను ననగా సుంకములభటులను నిరాయుధపాణులుగ నొనర్చుటయును సముద్రప్రాంతరక్షకనావల నిరర్థకముగాఁ గావించుటబట్టియు చీనాలోనికి సుంకములులేకుండ జపానువారివస్తువులు లెక్కలేకుండ తీసికొనఁబడుచుండెడివి. అందుచే నుత్తరచీనాలో నీజపానువారివస్తువు లెడతెగకుండ వ్యాపించిపోయినవి. ఈకార్యము వలన "అమెరికా" "ఇంగ్లాండు" వారివ్యాపారము చీనాలో చచ్చినది. అద్దానితో మనకేమియుఁ బ్రసక్తిలేదుగాని చీనావారి సుంకములరాబడి చాలభాగము తగ్గిపోయినది. దేశములో వ్యాపారమంతయు తీన్తారయినది. చీనావారిసుంకముల రాబడిలో నొక్కమాసములోఁ బ్రభుత్వమువారికి పోయినది 8,000,000 డాలర్లు. జపానుప్రభుత్వముతో చీనావారు తరితరాలుకూడ నెంత మొఱ్ఱపెట్టుకొన్నను నేమియు లాభము లేకపోయినది. జపాను రాజకీయవ్యవహారశాఖవారు దొంగతనముగా చీనాలోనికి వస్తువులను దీసికొనపోవడము గురించి తమకేమియు తెలియదని యబద్ధపుమాటలు చెప్పుచుండగా జపాను సాంగ్రామికాధికారులు చీనావారికి జపానువారియందుండు భావములుమారితే యీదొంగతనమంతయు కట్టునని

తెల్పినారు. వీనికిఁదోడు రైళ్లలోఁగూడ జపానువారు సుంకము లివ్వకుండ టిక్కెట్లుసొమ్మివ్వకుండ బాడ్గనునింపు సామానులతో ప్రయాణములుసాగించుట ప్రారంభించినారు.

ఈబాధ లీరీతినిజరుగుచుండగా జపానుప్రభుత్వమువారు చీనా కమ్యూనిష్టుల సేనలను నుత్తరచీనానుండి కలిసి తరిమి వేయుదమని కోరిరి. అందులకుఁ జీనావా రంగీకరింపలేదు. కమ్యూనిష్టుసేనలను చీనాయొక్క తూర్పు దక్షిణ పశ్చిమభాగ ములనుండి కేంద్రప్రభుత్వము తగిలవేయగా వారుత్తర పశ్చిమభాగములలోనుండిరి. అచటనుండుటచే చీనా కేంద్రప్రభుత్వము నకు నేబాధయు లేకుండ యుండెను. ఇంతియకాక జపానుసైన్యములుండుటకంటె చీనా కమ్యూనిష్టుల సేనలుండుటయే వర మని చీనాప్రభుత్వముయొక్క యుద్దేశము. చీనా కేంద్రప్రభుత్వము సామ్యవాద పక్షపాతులైయుండి జపానుప్రభుత్వముతో సోవియట్ ప్రభుత్వమువారు యుద్ధము చేయుటకొరకు దగినసాహాయ్యము రష్యాప్రభుత్వమునకుఁ గావించుచున్నారని జపానువారు చీనావారిని నిందించుట మొదలుపెట్టినారు.

1911వ సంవత్సరమువరకుఁ బూర్వము చీనాప్రజలు పూర్వకాలపు టాచారధర్మాదులనే పట్టుకొని విడువక పూర్వకాలమున వారికినుండిన ప్రతిభనుగూర్చి గర్వపడుచు జీవిత విధానములలో కాలపరివర్తనము జరుగుటవలన నవసరమగు మార్పులను గావించుకొనక యాలస్యస్వభావముగలిగి పాశ్చ

స్థులై యుండిరివారు. రెండుదశలకాలము మాత్రము తెన్ను గానక క్రమమైన దారికొఱకు వెదకుకొనుచుండిరి. ఇప్పుడన్ననో తదితరప్రపంచమునుండి ముఖ్యావసరములను తెలిసికొని భావికాలములో నభివృద్ధిచెందు విధానములను శాస్త్రమార్గములను తెలిసికొని యభివృద్ధిమార్గమును త్రొక్కుటకు మొదలు పెట్టినారు.

1936 డిసెంబరులో సియాన్ఫూలో సేనాని చియాంగ్ కై షెక్‌ను చంగ్ హ్స్యూ లియాంగ్ అను నాతడు పట్టుకొనినాడు. కొన్నిదినములు సేనానాయకుని కేమయినదో తెలియక ప్రజలందోళిత మనస్కులై కాలముగడపినారు. మూడు వారములైనపిదప సేనానాయకుని విడుదలచేయగనే దేశమంతయు నమితోత్సాహముతో దీపావళీ గడువలె నుత్సవముగావించినారు. ఈమధ్యను దేశములోనుండు ప్రజలందరొక్క దేశనాయకుని శ్రేయస్సుకొరకు నింతయుత్సాహము కనబరచుటయిదియే మొట్టమొదటిపర్యాయమని గుర్తించవలయును. రమారమి 25 సం॥ దేశమునమ్ముదగినటువంటిన్ని, బలవంతులైనటువంటిన్ని, నాయకుడులేక బాధలుపడినది. చియాంగ్ కై షేక్ అను నాయకునిగనుగొని సంతసించుట ప్రారంభించినది.

జపానులో నైకమత్యముపెరుగుట జపానుప్రముఖుల కెంతమాత్రము నిష్టములేదు. దేశములో ప్రజలు కలహించుచుండినచో విస్తారమైన బాధలేకుండ జపానువారు దేశభా

ముల నాక్రమించుటకు వీలు కలుగును. ఇదివరలో చీనాజపాను యుద్ధము జరుగుచున్నప్పుడు జపాను వారియుద్ధనావలు "కాంటు ను" పట్టణములో చీనావారిచే స్వాగతమొసంగబడెను. ఇక ముందుమాత్రమట్టిది జరగబోదని జపానువారికీ తెలియును.

సేనాని చియాంగ్ కైషేక్ యూరకుని యుండలేదు. దేశరక్షణకై సైనికవర్గమును తయారుచేసికొనుచు యుద్ధపరిక రములను తయారుచేయుటయేకాక పరదేశములనుండి విస్తార ముగా వానిని దిగుమతిచేయుచుండెను. గతకొన్ని సంవత్సరముల నుండి చీనాప్రభుత్వము దిగుమతిచేయుచుండిన యుద్ధసామగ్రి దేశపు దిగుమతుల మొత్తములో నెయిదవవంతుకంటె తక్కువగా నుండలేదు. ఇదివరలో చీనావారి సేనలు కేవలమూకలవలెనుండె డివి. అట్టి యాశిక్షితులైన సైనికులందరుపోయి, సుశిక్షితులును యుద్ధనైపుణ్యముగల నూతనసిపాయిలు ప్రపంచములోమరి యేసిపాయిలకు నిడుతీయని బంటులై దేశసంరక్షణమునకు సం సిద్ధులైయున్నారు.

ఉత్తరచీనాను జయించుట పొడిగింపబడినకొలది జపా నువారి కష్టములెక్కువగునుగాని తక్కువకావు. యుద్ధమున కగుఖర్చు లెక్కువగుటయేగాక ప్రజానష్టమమితముగా జరు గునని జపానువారికి తెలియకపోలేదు. అందుచే 1937 మొద టిభాగములోనే చీనావారితో యుద్ధముచేయుటకొరకు జపా నువారు వేచియుండిరి. అట్టియవకాశము స్పెయినులో ప్రారంభ మైన యంతఃకలహాము కలుగజేసినది. స్పెయినుగలిబిలితో పాశ్చాత్య

ప్రభుత్వములు తుక్కులవలె కొట్లాడుకొనుట ప్రారంభించినవి. ఐరోపాఖండములో నంతఃకలహములతోను మనస్పర్ధలతోను రాజకార్య నిర్వాహకదక్షులు బాధపడుచున్న సమయములో వారికిజపానుచీనాలో చేయు నన్యాయములనుగూర్చి యుద్ధపడు నవకాశముండదని జపానువారు నిశ్చయించి చీనాసైన్యములను నచిరకాలములో చెండాడి యుత్తరచీనాను జయింపగలమను నమ్మకముగలిగినది. అమెరికాప్రభుత్వమైనను జపానుచీనాకలహములో జోక్యము కలుగజేసికొనదని జపానువారు దృఢముగా నమ్మి యుండిరి. ఇకసోవియట్ రష్యావలనమాత్రము ప్రమాదము సంభవింపవచ్చునేమోయని యనుమానించిరి గాని దేశద్రోహులు సోవియటురష్యా దేశములో పరికరములను నాశనము చేయుచు ప్రభుత్వమునకు హానికలుగఁ జేయుచున్నట్టుల సంభవములనుండి బయటఁబడెను. ఈసంభవములనుబట్టి సోవయటు సేనలో నైకమత్యము లేకయుండుటచే జపానుప్రభుత్వము వలన హానిసంభవింపనేరదని జపానుప్రభుత్వమువారు నిశ్చయించినారు. అయినను సోవయటుప్రభుత్వ మేవిధమైనదన్నదో పరీక్షచేయుటకై మంచుకుఓ రష్యాప్రాంతభాగములలో కొన్నికలిబిలీలు జపానువారు కలుగఁజేయగా సోవయటు ప్రభుత్వమువారికి సామాన్యముగానుండు చురుకుదనముతో నీవిషయములగూర్చి వారుశ్రద్ధతీసికొనలేదు. ఆదిసోవయటు ప్రభుత్వముజపానువారి కెట్టియడ్డంకులను కలుగఁజేయు పరిస్థితులలో లేదని జపానువారికి దోపించినది.

1937 జూలై 7వ తేదీని పీకింగున కనతిదూరములో నున్న మార్కోపోలో వంతెన సమీపమున జపానువారు యుద్ధవ్యూహములు గావించుకొనుచుండగా నడిరేయి పురజనులు, సేనలుపోవుచున్న ధ్వనివలన నిదురనుండి మేల్కాంచిరి. జపానువారు జెప్పునదేమనగా నొకతుపాకి చప్పుడు వినిపించెననియు, సైనికుల మస్తరుతీయగా సైనికులలో నొకడు గాన్పింపలేదనియు స్పష్టమైనదట. ఈక్షుద్రసంభవమే లక్షల కొలది ధననష్టమునకును, లక్షలకొలది ప్రజలవధకును, దేశము స్మశాన వాటికవలె నగుటకును గారణమయ్యెను. పొరుగు వారింటిలో ప్రవేశించి యీ విధమున ప్రజానాశనమునకు బూనియున్న జపానువారిని యెంత నిందించినను తప్పులేదు.

జపానుదేశములో నమెరికా యూరోపా ఖండములలో నుండు దుష్టత్వమంతగా గాన్పింపదు. ప్రజలు కష్టపడి యొడలొంచి పాటుపడు స్వభావముగలవారు. 19వ శతాబ్దము మధ్యభాగమువరకు నెట్టి ప్రతిభలేక, ప్రకృతి శాస్త్ర జ్ఞానములో ప్రతిభలేక, కర్మాగారములులేక, వస్తునిర్మాణశక్తి యతిహీనముగా గలిగి, పెద్ద సేనలుగాని, నావికాదళములుగాని లేక, జలబాష్పముతో నడపబడు నోడైనలేక, జపాను 80, 90, ఏండ్లలో ప్రపంచ ప్రభుత్వములలో నగ్రస్థానము నలంకరించుచు, ప్రపంచమును చవుకగు వస్తుజాలముతో నింపుచు, వస్తునిర్మాతలకు భయముకలిగించుచు, నుండుటచే జపాను వారికి వారిప్రాశస్త్యము, శక్తిసామర్థ్యములలోను నమ్మకము

అమితముగాఁగలిగినది. వారుప్రపంచములో చేయవలసిన ఘన కార్యమొకటి యుండనియు, నితరదేశములవారలకు తాము మార్గదర్శకులయియుండుటవసరమనియు వారినమ్మకము. జపాను వారిప్రబోధము చీనావారి ప్రబోధముకంటె ప్రశస్తమైన దనియు కావున చీనావారిప్రబోధమునవసరమైనచో యుద్ధముచేసి నాశనముగావించి జపానువారి ప్రబోధమును చీనాదేశములో వ్యాపింపఁజేయుట వారిముఖ్య విధియని వారిదృఢవిశ్వాసము. చీనావారి విశ్వవిద్యాలయములను, పుస్తక ప్రకటనాలయములను నీనమ్మకముతో మట్టిలోఁ గలిపివేసినారు. ఇట్టి ఘోరములను చేయుచున్న జపానువారెంతవరకు నిందాభాజనులగుచున్నారో చదువరులకే తెలియును.

ప్రపంచ సామ్రాజ్యమునకై జపాను యత్నించుచున్న దేమోయని కొందరి పండితుల యనుమానము. చీనాదేశమును జయించి చీనా సంపదనుపయోగించు నధికారమును సంపాదించి "హాంగ్‌కాంగ్" "సింగపూరు" "ఫిలిప్పైన్సు" దీవులను జయించి తరువాత క్రమముగా నాసియా ఖండమునంతయు జయింపనున్నారు జపానువారు. చీనావారి తరువాత యెవరిపై బడుదురో జపానువారు?



# జెకోస్లోవేకియా - జర్మనీ

జెకొస్లొవేకియాయను ప్రజాతంత్రరాజ్యము మహాయుద్ధమునకుఁ బూర్వము లేదు. మహాయుద్ధానంతరమున జర్మనులను విడఁదీసి యణఁగదొక్కు తలంపుతోఁ బరాసు రాజనీతివిశారదులు నాంగ్లరాజ నీతిజ్ఞులును గలిసి కావించిన విశ్వామిత్ర సృష్టి యిది. బొహీమియా, మొరేవియా, సైలీషియా యను నుడటను మండలములను స్లొవేకియా, కార్పథొరష్యను పశ్చిమకార్పథియను మండలములను గలిపి జెకొస్లొవేకియాయను రాజ్యమును నిర్మించిరి. నూఱుమైళ్లకధికముగాని వెడల్పుగల యొక సన్నని చీలిక ఈ రెండు భాగములను గలుపుచున్నది. 54,200 చదరపుమైళ్లు తద్రాజ్యపు విస్తీర్ణము. దానిసీమలపొడవు 2554 మైళ్లు. ఈసరిహద్దులలో 51వ శాతము జర్మనీ సరిహద్దులతోను, 23.9 శాతము పోలండుసరిహద్దులతోను, 20.2 శాతము హంగరీ సరిహద్దులతోను 4.9 శాతము రుమేనియా సరిహద్దులతోను గలిసియున్నది. ఈ దేశములోనున్న మూడు రైలు మార్గములలోను రెండు యుద్ధసమయములలో నిరుపయోగములని జెక్కుసాంగ్రామికోద్యోగులు తెల్పిరి. యుద్ధసమయమున స్లొవేకియా కార్పథొ రష్యా మండలములఁ గాపాడుట కష్టమని వారి యభిప్రాయము. జెకొస్లొవేకియాయొక్క నైసర్గిక పరిస్థితులను బట్టిచూచిన

దన్ని ర్మాణము రాష్ట్రస్థిరత్వమునకు కారణము కాదని తెలియఁగలదు. ఒకప్పుడు, భిన్నభిన్న జాతులవారొక్క గుదిగా చిరకాలమునుండి నొక్కొక్క మండలములో నుండి యుంటచే సమూహమును వేఱుచేయు నుద్దేశములేక యీ రాజ్యమును మిత్రమండలివారు నిర్మించిరేమో యని యూహింతనన్నను నదియు సకారణముగా నగపడదు. 1930 సంవత్సరములో జరిగిన జనాభాలెక్కలనుబట్టిచూచిన నీరాజ్యములో 7, 406, 493 సంఖ్యగల జెకొ్కలును, 3, 231, 688 సంఖ్యగల జర్మనులును, 2, 282, 277 సంఖ్యలవారు స్లొవక్కులును, 681, 923 సంఖ్యగల హంగేరియనులును, 549, 169 మంది రుథీనియనులును, 186, 642, మంది యూదులును, 131, 373 మంది తదితరజాతులకుఁజెందిన ప్రజలున్నట్లు తెలియుచున్నది. కాని 3, 200, 000, మంది జర్మనులొక్కచో నున్నట్లగపడదు. సుడటనులో 148, 102 మంది జర్మనులును, 66, 265 మంది కార్పేథియను మండలములోను, 2600, 000 మందియొక్క రాష్ట్రభాగములోను నున్నట్లు 1930 సంవత్సరపు జనాభా లెక్కలు చాటుచున్నవి. ఈరాష్ట్రము జాతీయరాష్ట్రము కాదు; కాని సంయుక్తరాష్ట్రమై యొప్పుచున్నది.

మహాసంగ్రామము ముగిసినపిమ్మట నపజయమునందిన జర్మను దేశీయులు నిరవధిక నిరుత్సాహబాధితులు నిస్సహాయులునై యధైర్యముచే దారి తెన్నునుగానక, జయశీలురగు మిత్రమండలివారేమిచేసినను 'సరియే' అని తలలూపుచు నెట్టి

సంధి సమయములనైన నొప్పుకొనఁదగిన దురవస్థలోనుండిరి. ఆంగ్లపరాంసు దేశీయులు వీరిపైఁ గసిఁదీర్చికొనఁదలచి దయా దాక్షిణ్యావిరహితులు విచారశూన్యులు జయోన్మత్తులునై దూరాలోచనలేక జర్మని, యాస్ట్రియా హంగరీసామ్రాజ్యముల విచ్ఛిన్నముగావించుచు, నాయాప్రజలుంమండలము లొక రాష్ట్రములో నుండునంతకాలమును మధ్య యైరోపాఖండము లో నశాంతియుఁ బరాంసుదేశమునకు భీతియునొదవించు పరి స్థితులుండునను విచక్షణ విరహితానుమానముల నిర్మూలము కావించుటకు వార్సేల్సుసంధిని గావించిరి.

అమెరికాదేశపుఁ బరిపాలకాధ్యక్షుఁడు విల్సను మహా శయుఁడు మహాసంగ్రామములో మిత్రమండలిపక్షమును దాను వహించునపుడు ప్రపంచములోని యన్నిప్రభుత్వములును బదు నాల్గు షరతుల నేర్పాటుచేయ రాజకీయముగ వీనినాచరణలో బెట్టుటకై యామహాయుద్ధమం దెట్టిసంబంధమునులేని తమ ప్రజలను యుద్ధములో దింపుచున్నానని ప్రకటించెను. ఆపదు నాల్గు షరతులలోను జెకోస్లోవేకియాతో ముఖ్యసంబంధము గలవి యీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

(1) ఆస్ట్రియాహంగరీ సామ్రాజ్యపు జాతుల శ్రేయ స్సును కాపాడుచుఁ బ్రపంచజాతులలో వారిస్థాన మును స్థిరపఱచుకొనుటకుఁగావలసినయభివృద్ధిమార్గముల నవలం బించుటకు వారికి సంపూర్ణస్వాతంత్ర్యము నొసంగవలెను.

(2) చివరనిర్ణయము జరుగునపుడును, ప్రతివిషయము నిర్ణయింపఁబడునప్పుడును దద్విషయముల మంచిచెడ్డలను విచారించి యుద్ధములు లేకుండఁ జిరకాలము శాంతి యుండునట్టి ప్రత్యేకనిర్ణయ ముండవలయును.

(3) జనసమూహములును మండలములును చతురంగాది ద్యూతక్రీడలలోఁ బాచికలవలె నొక ప్రభుత్వమునుండి యింకొక ప్రభుత్వమునకు మార్పఁబడఁగూడదు. వివిధప్రభుత్వబలములను సమముగ నుంచుటకును నట్టిమార్పులు గావింపఁబడఁగూడదు.

(4) మఱియు నీయుద్ధముతో సంబంధముగల ప్రతిరాష్ట్ర వైశాల్యనిర్ణయమును తద్రాష్ట్రసంబంధిప్రజల మేలుకొఱకే కావింపఁబడవలెనుగాని విరోధి ప్రభుత్వముల కోర్కెలఁ దీర్చుటకుఁ గావింపఁబడఁగూడదు.

(5) స్పష్టపఱుపఁబడిన జాతీయాశయములు, నూతన విరోధములను గలిగింపకుండునట్లును, నికముందైరోపా ఖండమునఁగాని మఱియెచ్చటఁగాని యుద్ధమును బురికొల్పి శాంతి భంగము చేయకుండఁగను నుండునట్లుగ వానిని సంపూర్ణముగఁ గార్యసాధకములఁ గలిగియుండునట్లు గావింపవలెను.

పైఁజెప్పిన షరతులెంతవఱకు మిత్రమండలివారిచేఁ బాటింపఁబడినవో యాఱయుదము. 1919 సంవత్సరము ఫిబ్రవరి 5వ తేదీని డాక్టరు బెస్నాక సభలో "స్వతంత్రజెకోస్లొవేకియా రాష్ట్రము నేర్పరుచుటకై [illegible]

యిప్పటికిమూడువత్సరముల యాఱుమాసముల క్రిందటనే ప్రారం
భింపఁబడినది" అని చెప్పెను. ఈస్వాతంత్ర్య రాజ్యస్థాపన మింత
యల్పకాలములోఁ గావింపఁబడుటకైన ప్రవృత్తిబహువురాతన
మైనదికాదని నిశ్చయింపవచ్చును. దీనికిఁదోడు రాజ్యస్థాపకులు
తన్నిర్మాణమొక శతాబ్దమైన నిలిచియుండవలెనని యూహించి
నట్లగపడదు. మహాసంగ్రామానంతరమున నేర్పడిన
నూతనరాజ్యములలోఁ జాలవఱకొకే-జాతివా రధికసంఖ్యా
కులైయుండిరి. తదితరజాతులవారున్నను వారత్యల్ప సంఖ్యా
కులైయుండిరి. అయినను నాయల్పసంఖ్యాకజాతుల వారలధిక
సంఖ్యాకుల పరిపాలనవిషయములలో విభేదములులేక పొంగాను
చుండిరి. ఈపైవిషయము జెకోస్లొవేకియా రాష్ట్రములోఁ
బాటింపఁబడియుండలేదు. ఇందు జర్మనులసంఖ్య జెకుల
సంఖ్యలో నించుమించుగ సగముండును. ఈజర్మనులు విశిష్టప్ర
బోధవంతులు శక్తివంతులునై యుండిరి. అట్టిప్రబుద్ధులును వారి
యిష్టముతో రాష్ట్రమున నుంచుకొనవచ్చునుగాని యనిష్ట
ముతో వలనుగాదుగదా! ఈవిషయమునే నూతనముగా నిర్మిం
పఁబడిన యీరాష్ట్రపాలకసంఘము గ్రహించి మిత్రమండలి
సంధిసమయములను నిర్ణయించిన రాజ్యకార్యధురంధర చతుష్ట
యమునకు నివేదించినది. "ఈనూతనరాష్ట్రముయొక్క శ్రేయస్సును
దానిస్థైర్యమును జర్మనులను సమ్మతిపఱచి వారినిదములో నొక
రుగఁజేసికొనుటపై నాధారపడియుండును. ఈకార్యము మిగుల
గష్టసాధ్యము. ఇతరదేశములలోనున్న యల్పసంఖ్యాకుల

రక్షించుటలో యాయా ప్రభుత్వముల వారలకగు కష్టముకన్న వీరసుడటనుజర్మనుల ల్పసంఖ్యాకులుగానున్న రాష్ట్రములో వీరినిసంరక్షించుట మిగులకష్టముగావున నీసమస్యను బరిష్కరించు విషయము జెకోస్లోవేకియనులకే విడువంబడినది."

ఈరాష్ట్రనిర్మాణము కావింపంబడినపుడది స్థిరముగనుండుటకుం దగినపరిస్థితులు లేకపోవుటయే గాక దేశక్షేమమునకు విరుద్ధములైన విషయములెం దంతర్గతములై యుండెనని పై వ్రాతంబట్టి తెలియుచున్నది. దీనికిందోడుగ దేశమందార్థిక సాంఘికపరిశోధ సంబంధవిషయములలో సంకటావస్థ సంభవించి నష్టముకలుగనున్నపుడెల్లను సుడటను జర్మనులే యానష్టము ననుభవింపవలసి వచ్చుచుండెను. జెకోస్లోవేకియాలో జెక్కుల పత్రములు పదునాల్గున్నవి. వారిలో వారికింగుదురునపుడు నష్టమును సుడటను జర్మనులచేతనే యనుభవింపంజేసి వారు తమ విరుద్ధవిషయములను సరిచేసుకొనుచుండిరి. అయిరోపా ఖండమందలి తదితరదేశములలోంగూడ నధిక సంఖ్యాకజాతుల వారల్పసంఖ్యాకులను వినియోగించి వారికి నష్టముకలిగినను దమ కార్యములను సాధించుకొనుటయు నట్టి కార్యసాధనములో నల్పసంఖ్యాకజాతులకు నష్టము దుర్భరమైనదని భావించుటయుం గనుచున్నారము. మఱియు నిట్టివి నీతితో సంచరించినందకా యల్పసంఖ్యాకజాతిగణములు సర్వశక్తులును ప్రక్షీణములైనపుడు వారితప్పిదమును గ్రహించుటయుం గనుచున్నారము. వార్సేల్సు సంధిజరిగిన యిరువదియేండ్లకు జెక్కుల

తమయిష్టమువచ్చినట్లుగ సుడటను జర్మనులనుండి లాభములను బొంది తుదకు వారిని నైరాశ్యమునముంచి వారికి సాహస కార్యాచరణబుద్ధి నొదవించిరి.

జెక్కులాస్ట్రియాహంగేరియా రాష్ట్రములోనివారైయుండి. 1867 సంవత్సరము నుండియు వారు సమ్రాట్టుల కలజములు కలుగజేయుచు లాభముల నందుచునేయుండిరి. ఇటు చేయుట న్యాయమాయను ప్రశ్నకిచట సమాధాన మీయ నవసరములేదు. పరప్రభుత్వాధీనములో నున్నపుడు పరిపాలకులకు, భిన్నమగుజాతికిఁ జెందిన యల్పసంఖ్యాక జాతిగణము లీవిధముగనే యలజడులు కలగజేయుట సంచరింపక మానవు. మహాయుద్ధానంతరము జెక్కులకు స్వతంత్రరాజ్యమేర్పడినతరువాతనుగూడ రాష్ట్రపరిపాలనాధికారము చాలవరకు వారలలోనేయున్నను ఆస్ట్రియా హంగరీసామ్రాజ్యములోనున్నట్లే సంచరించుచువచ్చిరి. ఇరువదిసంవత్సరముల క్రిందట నూతనరాష్ట్రమేర్పడినపుడు జెక్కులు నీతిజ్ఞులుకావించిన ఖరారును నిలువబెట్టుకొనుమని దేశములోని సుడటను జెర్మనులేకాక యుక్రేనియనులు, పోలులు, హంగేరియనులు, స్లావక్కులును గూడఁ దీవ్రముగఁ గోరియుండిరి. దీనింబట్టి యల్పసంఖ్యాక భిన్నజాతి గణములన్నియుఁ జెక్కుజాతికిఁజేరని యల్పసంఖ్యాకజాతిగణములవారు కృశించి కృశించి యతి దురవస్థకులోనై యుండిరని యూహింపవచ్చును.

1914 సంవత్సరమునకుఁ బూర్వము స్వాతంత్ర్యాధికారము గల రాష్ట్రములన్నియుఁ బరంపరగవచ్చుచున్న కొన్ని యధికారములను గలిగియుండి కొంతవఱకు రాష్ట్రవైశాల్యమును హెచ్చుచేయు నావశ్యకమును గలిగియున్నవి. కాని యట్టి పరంపరాధికారములేని నూతనరాజ్యములు తదాధిజ్యస్థాపన కనువగు విపరీతభావము లంతరించివఱకున సంకటావస్థలోఁ బడక మానవని నిశ్చయింపకతప్పదు. మహాయుద్ధములో నోడినవారు పరాజయవివశత్వము నొందుటచే జెకోస్లొవేకియారాష్ట్రము నిర్మింపఁబడినదైనది. జర్మనులట్టి దౌర్బల్యమును బోగొట్టుకొనిన వెంటనే యీరాజ్యస్థైర్యమునకు హాని వాటిల్లకతప్పదని నీతివిదులూహించినవిషయమే. 1919 సంవత్సరములో జరిగిన సంధినయములు నిరర్థకములని జర్మనులు చూపింపనారంభించిరి. వారుత్సాహవంతులై ప్రాపంచికవిషయముల నిర్ణయించుటలో శక్తి నిరూపింపగలిగిన యవకాశమును సంపాదించిరి. అప్పుడే జెకోస్లొవేకియా వినాశనమునకుఁ గాలము సంప్రాప్తించినది.

జెకులలో నీతివిశారదులీ విషయమును గురుతించి వారికిఁ బారంపర్యముగ వచ్చుచున్న స్వాతంత్ర్యరాజ్యస్థాపనాధికారములంగూర్చి యొకనివేదికను తయారుచేసి సంధినియమములనిర్ణయించు మిత్రమండలి రాజకార్యధురంధరులకు దాఖలుచేసిరి. క్రీ॥ శ॥ 7వ శతాబ్దములో మోరేవియాను సామ్రాజ్యముండెడిదనియు, నది జెకులదనియు, క్రీ॥ శ॥ 12వ శతాబ్దములోనే జర్మనులీరాష్ట్రములోఁ బ్రవేశించి వలసలేర్పరుచుకొని

రనియు, హుస్సైటుయుద్ధము లో నీజర్మనులలో కొలదిపాటిమంద లములలోనివారుతప్ప దదితరులందరు నిర్మూలముకావింపఁ బడిరనియు నందువ్రాయఁబడినది. ఈవ్రాఁతను జర్మనులేకాక పెకారను జెకు చరిత్రకారుఁడుకూడ నసత్యమని దృఢముగ ఖండించెను. ఈవిషయములన్నియును క్రీ॥ శ॥ 19వ శతాబ్ద మధ్యభాగము లోనే వ్యక్తీకరింపఁబడినవని మనము నిశ్చయింపవచ్చును. ఇవి జెకులు చెప్పినట్లు పండ్రెండువందల సంవత్సరముల నుండియు లేవు. ఈభావములలో నంతర్గతమై ముఖ్యస్థానము నలంకరించుచున్న భావము" జెకులున్న మధ్యస్థానము జర్మనులతోఁ బ్రాణాంతక శత్రుత్వమునుఁ గలుగఁజేసినది. జర్మనులు వారలహింసించుచుండెడివారు. జర్మనులకు వారు విరోధులై యుండ నిచ్చగించిరాయను ప్రశ్నయడుగనవసరములేదు? ఏలయన పరిస్థితులట్టి విరోధముండునట్లు నిర్బంధించినవి. అదియే జెకులకుమానవచరిత్రములో ధరింపవలసిన పాత్రయైయుండెను."

క్రీ॥ శ॥ 895 మొదలు 1806 వఱకును బొహీమియా రాష్ట్రము జర్మనుసామ్రాజ్యములో నొక "మెలక్టొరేటు" అయియుండెను. క్రీ॥ శ॥ 1356 నుండియు నూతనసామ్రాట్టు నెన్నుకొనవలసిన యవసరములో వీరికి "కాస్టింగువోటు" అను విశిష్టాధికారముండెను. ఈబొహీమియా రాజులు పలువురుజర్మను చక్రవర్తుల సామంతరాజులలో నతివిశ్వాసపాత్రులై యుండెడివారు. జర్మనుకర్మకారులు వణిజులు మున్నగువారల నీబొహీ

మియారాజులు తమ దేశమునకు రప్పించుకొని వారికి దగు వసతులొసగి తమ దేశములో వసించియుండునట్లు చేసికొనిరి.

బొహీమియా, పోలండు, హంగరీ అను దేశముల పరిపాలకులొకప్పుడు బంధువులై యుండుట సంభవించుచుండెడివి. లక్సెంబర్గు పరిపాలక వంశమునకు జెందిన నాలుగవ ఛార్లెసను సామ్రాట్టు పరిపాలించిన కాలములో నాతడు బొహీమియా దేశపు రాజైయుండుటం జేసి యా దేశమత్యుచ్ఛదశను జెందెను. ఐరోపా ఖండములో జాతీయ సాంఘిక సంబంధములలో నశాంతి మిక్కుటముకాగా తమ సంబంధములలో బాధలు కలుగకుండ వాసింబోగొట్టుటకు హస్సైటు యుద్ధము కావింపబడినది. అది కర్షకుల యుద్ధము. క్రీస్తుమత సంస్కార సంబంధమైన యుద్ధములతో నది సరిపోలునని మనము చెప్పవచ్చును. ఆయుద్ధమువల్ల ముఖ్యముగా గలిగిన ఫలితము దేశప్రబోధాభివృద్ధి నశించుటయే. ఈ ప్రబోధనాశము ప్రజలచే గావింపబడినదను విషయమెంత శోచనీయము. ఈ హస్సైటు ప్రవృత్తివల్ల జెక్కులలో జాతీయభావము లుద్భవించెనన్న మాట నిజమే కాని వారికి నైతిక పరిణామ మేమియు వర్ధిల్ల లేదనుట నిశ్చయము. ఇందువల్ల పశ్చిమ దేశస్థులవలెనుండుటయు వారి ప్రబోధమువంటి ప్రబోధము నగలిగియుండుటయు పశ్చిమమునకు వ్యాపించుటయు మున్నగు కాంక్షలు వారి భావములలో నంతర్భూతములై యున్నట్లగుపడుచున్నది. క్రీ॥శ॥ 5, 6, శతాబ్దములలో వీరికి మంగోలులతో గలిగిన సంబంధమువల్ల నీభావములు కలిగెనే మా

చెప్పుట కష్టము. అయినను జెక్కుల జాతీయ భావములు ప్రాక్పశ్చిమదేశములలో నుండు నవ్యభావ పరిభావములకు లోనైయుండి యైరోపాఖండపు బరిబోధమును విశదకయుండి యొకప్పుడు ప్రాగ్దేశపరిబోధ పరిభావమునకును నొకప్పుడు పశ్చిమదేశపరిబోధ పరిభావమునకును లొంగియున్నట్లు నిశ్చయమగుచున్నది. ప్రాగ్దేశపరిబోధపరిభావము మధ్యయైరోపాఖండముతో జెక్కులైక్యమును బొందకుండుటలో నగుపడుచున్నది. పోలండుదేశస్థులు సెర్బియనులు నిట్టిపరిభావమునకు లోనైయుండక మధ్యయుగములలో సామ్రాజ్యములను స్థాపింపగలిగిరి. జెక్కులుమాత్ర మట్లు చేయజాలకుండిరి. ప్రతిభావంతమగు పూర్వవృత్తమును నుత్సాహ మొదవించు నట్టియు బాహ్యులవృత్తిం బ్రకటించునట్టియు నైతిహ్యమును, స్వాతంత్ర్యవ్యక్తిత్వము వీనికొఱకు బరితపించుచు బాధపడుచుండుట వారిప్రవృత్తి యైనది.

ఆస్ట్రియాదేశపు బ్రధానియగు డ్యూకు ఫెర్డినాండు బొహీమియా రాజుగా నెన్నుకొనంబడిన 1526 సంవత్సరమునుండియు స్వాతంత్ర్యమునకై పోరాటము తాము సలుపనారంభించినారని జెక్కులు చెప్పుచున్నారు. వారుతమంతటదాము హాబ్సుర్గు సామ్రాజ్యములో జేరుటం జేసి వారినుద్ధరించుటకై తత్సామ్రాజ్యాధిపతులు కావించిన సమయములు రద్దుపరచిన యెడల తత్సామ్రాజ్యములో నుండి తొలగిపోవు నధికారము తమకుం గలదని వారు చెప్పుచుండిరి. 1620 సంవత్సరములో జరిగిన వైల్ల

కొందఱు యుద్ధములో జెక్కులసామంత ప్రభువులు సర్వస్వమును గోలుపోయినారనియు హాబ్సుర్గులు జెక్కులను మితిలేని బాధలఁ బెట్టి వారిభాషనుసైతము నశింపఁజేయఁ బ్రయత్నించిరనియు వారల నిర్మూలింపఁ బ్రయత్నించిరనియు జెక్కులు చెప్పుచుండిరి. హాబ్సుర్గులొక్క జెక్కు సామంతరాజులనేకాక జర్మను సామంతరాజులను గూడ ప్రోటెస్టెంటు మతము నవలంబించినందులకుఁ గాను ధూపుమాపఁబ్రయత్నించిరని తెలియఁగును. అట్టికార్యములచే హాబ్సుర్గులు ప్రొటెస్టెంటుమతముపై దమకుగల ద్వేషమును బ్రకటించిరి కాని జెక్కులను నిర్మూలించుటకుఁగాదు. మరియు హాబ్సుర్గులు తమయధికారమును కేంద్రీకృతము కావించుటకుఁ జేసిన కార్యములే జెక్కులభాషయొక్కయు సారస్వతముయొక్కయు నభివృద్ధికి గారణమయ్యెనని కొందఱుచరిత్రకారుల యభిప్రాయము. జెక్కులసారస్వతోద్భవము జరుగునపుడు జర్మను కవిపుంగవులు హెర్డరు, గోథీ, మున్నగువారు లమితమైనయుత్సాహము నగపరిచిరనియు నీకవిపుంగవుల హెచ్చరికవలననే యధిక బలము నాప్రవృత్తి సంపాదించెననియుఁ దెలియనగును. అయినను మొదటినుండియు జెక్కుసారస్వతములో జర్మనులపై ద్వేషముమాత్రము సూచింపఁబడుచునే యుండెను. జెక్కుసారస్వతాభివృద్ధికి దోడుపడినది యట్టి విద్వేషభావమె యని కొందఱిమతము.

హుస్సైటు యుద్ధము మొదలుకొని 1848సంవత్సరము వఱకును జెక్కుభాష బీదలభాషయైయుండెను. జాతీయాభివృద్ధి

ప్రవృత్తి ప్రబలిననాటినుండియు జెక్కులలో ధనవంతులు సామంతులునుగూడఁ దద్భాషనభిమానించుటలో నమితోత్సాహము గనపఱుప నారంభించిరి. ఇదియిట్లుండ 1848లో జెక్కు రాజనీతిపరులు జర్మనులతోఁ గలిసిఁ "మెటెర్నిఖు" అధికారమును త్రగ్గించుటకుఁ బ్రయత్నములు సలుప నారంభించిరి. ఆ తిరుగుబాటు జరిగిన సమయములో స్లావుల యుద్ధవిషయిక పరిషత్తు జరుగునపుడు పీడితులగు కోట్లకొలది స్లావులపక్షమున నొకప్రకటన గావించిరి: "దేవుని యభిప్రాయములో నన్ని జాతులవారికిని సంపూర్ణముగ సమానమైన హక్కులున్నవి. ఆంగ్లేయులైర్లాండుదేశీయులను బాధించుటలోను, జర్మనులు మగ్యారులు స్లావులను బాధించుటలోను వానిం దిరస్కరించుచున్నారు. రాజనీతిపరులు దేశములకుఁ బ్రజలకుఁ బ్రజలకు వారిజాతులకు భాషలకు నెట్టిగౌరవమును సూచింపక, వారినిం బాటింపక నిరసించుచు వారిని నిర్బంధముగాఁ దమ దేశములలో గలుపుకొనుటయో వారిని వేఱుచేయుటయో, వారిని తదితర మండలములకుఁగాని ప్రజాసమూహమునకుఁగాని వివరిగానిచ్చి పుచ్చుకొనుటయో, చేయుచుండుట సరికాదు" అని దృఢముగా ప్రకటించిరి. ఈప్రకటనలోని యితరవిషయములు విల్సనుగారి పదునాల్గు షరతులతోఁ జాలభాగము సరిపోలుచున్నవి. ఈ ప్రకటనలోనే వారు జర్మనులతోను మగ్యారులతోను సమానమగు హక్కులను దమకొసంగవలెనని కోరిరి. అన్నిజాతుల

వారలకును భ్రాతృత్వము సమానముగు హక్కులు స్వాతంత్ర్య
మును, నీమూఁడు నుండవలెనని ప్రకటించిరి.

1848 లో జరిగిన పరిషత్తులలో జెక్కులు కావించిన ప్రక
టనలకే మసరిక్కు మహాశయుఁడు జెకోస్లోవేకియా రాజ్యా
ధ్యక్షుఁడగువఱకును బ్రకటించెను. అప్పటి వారి యాశయము
లనే తనయాశయములుగా నాతఁడు చెప్పుకొనుచుండెను.
అన్నిజాతులవారికిని సమానమగు హక్కులుండవలెనని యాతఁ
డను దీవ్రముగాఁ జెప్పుచుండెను. జెక్కులకు స్వాతంత్ర్యపరిపాల
నాధికారము లాశతాబ్దాదినే యొసంగఁబడవలెనని యాతఁడు
కోరెను. "జాగ్రెబు" అను నాతఁడు దేశద్రోహియని వానిపై
న్యాయస్థానములో చర్చజరుగుచున్నపుడు సెర్బియనులయొక్క
యు క్రోటులయొక్కయు స్వాతంత్ర్యములనుగూర్చి యుద్రేక
ముతో నుపన్యాసములను గావించుచు నాస్ట్రియాహంగరీ
సామ్రాజ్యములోఁ బూర్తిచేయునగు సమస్యలలో వివిధజాతుల
వారికి సమానత యొసఁగుటయే ముఖ్యమైన విషయమని
యుద్ఘోషించెను. "జాతీయత రాజనీతియనునవి విభిన్నవిషయ
ములు. ఆస్ట్రియాలోనున్న జర్మనులకు "రీఖ్"లోనున్న జర్మ
నులయందుఁ గల సానుభూతిని బ్రకటించుట కెట్టియాటంక
మును లేనపుడాస్ట్రియాలోనున్న స్లావులకు ప్రక్కనున్న పరదేశ
ములోనిస్లావులను క్రోటులను బంధువులమని యోచించుచు
నట్టి బంధుభావములను బ్రకటించుట కాటంకము లెందుకుండ
వలయును?"

"ఆస్ట్రియాలో నున్న జర్మనులును రీఖులోనున్న జర్మనులును ప్రబోధైక్యముగల సంఘమును నిర్మించుట కెట్టియధికారములం గలిగియున్నారో యట్టి యధికారమునే యాస్ట్రియాలోనున్న సెర్బియనులు క్రోటులుంగూడం గలిగియున్నారు. ఇప్పుడున్న దుఃఖకారక విరోధ భావములను బోగొట్టి సుఖముగా నన్నిజాతులవారును స్నేహభావముతో నొక్కచో జీవించియుండుటకుం బూచీగల యధికారవర్గము వారెట్టి యేర్పాటులను జేయందలంచినారు?" అని 1909లో బారనువాను ఎహెరెంథాలును మసరిక్కు ఆచార్యుం డడిగెను. అప్పుడాతండును మఱియెవ్వరును అతనియిట్టి ప్రశ్ననితరులు ఏకారణముగా నడుగుదురని తలచియుండ లేదు.

1884లో ప్రకటించిన సిద్ధాంతముల కనుగుణముగా జెక్కులు 1919లో నెట్టియిక్కట్టులును సంభవింపని సుస్థిరమైన రాష్ట్రమును నిర్మింపంగల యవకాశమును గలిగియుండిరి. తమజాతివారికొరకొక్క రాజ్యమును గోరిన నది సిద్ధించియుండుటయేకాక వారికిట్టి యిరువది సంవత్సరములలో సంభవించిన యొడుదొడుకులుసంభవింపకయే యుండియుండును. వారు తమ జాతివారికై రాజ్యమును నల్పసంఖ్యాకులగు భిన్నజాతి గణముల బలప్రయోగముచే నణంగంద్రొక్క ప్రయత్నములం జేయు నావశ్యకతయుండి యుండకపోవును. రాష్ట్ర విదారణముగూడ సంభవింపకపోయియే యుండును.

మసరిక్కు అధ్యక్షుఁడు మొదట నధ్యక్షోపన్యాసములోఁ దెలిపిన విధమున జర్మనులజిల్లాలను నూతనరాజ్యములోఁ గలుపక విధిలేకవచ్చినదాయెను ప్రశ్నకు జెక్కు రాజనీతిపరులు సమంజసమైన సమాధానము నీయజాలకపోయిరి. జర్మను జిల్లాలను దదితర జాతులవారున్నజిల్లాలతో కలుపక పోయినను జెక్కులరాజ్యము యుద్ధానంతరము నేర్పడిన పెక్కు చిన్నరాజ్యముల జనసంఖ్యకన్న రెండింతలధికమగు జనసంఖ్యను గలిగియుండి యసంతృప్తులగు భిన్నజాతులవారిం గలిగియుండక సుఖముగ వృద్ధిఁబొందుచునే యుండి యుండుననని కొందఱు పండితుల నమ్మకము. ఈమధ్యనే జెకోస్లొవేకియా రాజ్యాధ్యక్షతను విడిచి పుచ్చిన డాక్టరు బెనిసుగారు 1895లో నీక్రింది విధమున వ్రాసిరి: "ఒకజాతియొక్క యాధ్యాత్మికార్థిక నైతిక ప్రబోధములకుఁ బ్రమాదము సంభవింపనున్నపుడట్టి జాతికిఁజెందినవారందఱును యుద్ధము, విపరీతచర్య, రాజపరివర్తనము కావించియైన నట్టివానిని సంరక్షించుకొనవలయును."

1915 అక్టోబరు 19 తేదీని మసరిక్కుగారు లండను నగరములో నల్పసంఖ్యాకులగు ప్రజలు గలజాతులంగూర్చి యుపన్యసించుచు జాతీయ స్వాతంత్ర్యమును విధానమే మంచిదని ప్రకటించుచు నట్టివారు మాత్రము శక్తిగల జాతులను వారి సామ్రాజ్యభావములకు లోనుకరింపఁగూడదని దృఢముగాఁ దెల్పిరి. కాని యుద్ధాంత సమయము సమీపించినకొలఁదిని మొదటఁ బ్రకటించిన భావములను క్రమక్రమముగా విడిచిపుచ్చెను.

అధ్యక్షుండైనపిదప దనరాజధానిలోఁ బ్రవేశించు సమయమున జెప్పిన "మనరాజ్యమును స్థాపించుకొంటిమి. తొలుత వలసజీవనమును సాగించుకొనుటకై యిచటికివచ్చి నివాసము లేర్పఱచుకొనియుండిపోయిన జర్మనులస్థానము మనరాజ్యవ్యవస్థాపనములో నుండునటుల నిర్ణయింపఁబడినది," అనునీవచనము లందునకాఠిన్యమునుజూచిప్రపంచము జెకుల యాశయములను గూర్చిపలుయనుమానముచెందకుండుటకై యాతఁడుకొంతకాలమైనపిదప "మనదేశములో నల్పసంఖ్యాకములగు జాతీయగణము లెట్టియుద్దంకును లేకుండ దమతమజాతివారల యాశయములననుసరించి జీవనావకాశము గలిగియుండు"నని చెప్పెను. మఱియునాతఁడు "రాష్ట్రములోనుండు నల్పసంఖ్యాకజాతిగణములనునిర్బంధముగను, నధికారపునియోగముగను, బలప్రయోగమునను వారికిశిష్టచిహ్నముల వారియంతటవారు వదలుకొనునట్లుచేయుట, వారిజాతినణగఁద్రొక్కుట యనునవిసంయుక్తరాష్ట్రములన్నిటిలోను శక్తియపక్షీణమునకుఁ గారణమగుచు ధర్మచింతను క్షీణింపఁజేయును. పరిపాలనచేయుచు పరులనణగద్రొక్కుజాతివారు బలప్రయోగముచేసి దుర్బలులబలవంతము చేయుటలో బలాత్కరింపఁబడు జాతివారల దుర్బలభావములను స్వీకరించుచు నాత్మశ్రేయమునకువిరుద్ధముగ సంచరించునట్లు చేయును.

"యుద్ధానంతర మొకజాతివారుండుప్రదేశముల సీమల నిర్ణయములు కొన్నిచోట్లఁ దాత్కాలికములై యుండవచ్చును.

వివిధజాతులవారును శాంతినిబొందు యాత్మనిర్ణయసూత్రము సంగీకరించినపిదప నేకజాతివారు వసియించియుండు మండల సీమలను నిర్ణయించుట యెట్టియలజడులును లేకుండగను యుక్తముగను జరుపఁబడవచ్చును" అను నీతిత్త్వములుమాత్రము రాజ్యస్థాపనసమయములో నిరాకరింపఁబడినవి. 1927 లో నాతఁడు రెండవసారి యధ్యక్షపదవినధ్యసించుచు నిలువఁబడినపుడు పదునేడుగురు జర్మను (సోషలుడెమొక్రాట్లు) సాంఘికప్రజాపక్షము వోట్లవలననే జయమునుగాంచెను. స్లావక్కుల ప్రజాపక్షము వారిరువదిమూవురు సభ్యులును దనకు వోట్లనీతనికీయ లేదు. జాతీయప్రజాపక్షమువారి పదుమూవురిలోను నలువురు మాత్రమే తమవోట్ల నీతనికిచ్చిరి. దేశపరిపాలనలోఁ దనస్థానమును నిలుపుకొనుటకై యాస్ట్రోహంగేరియను సామ్రాజ్యాధికారులు నైతికవిధానఖండనముఁ గావించుచును నాప్రభుత్వముతో యుద్ధముసాగించుటకుఁ దనకున్న యాశయముల నొక్కమాటుగా నిరాకరించి మంటఁగలిపెనని స్పష్టము. "ప్రజాతంత్రరాజ్యపాలనమును బలవినియోగము నంతముపొందించును" అని నుడివిననీతిపరుఁడనేక హింసాకృత్యములు ధర్మవిరుద్ధములు కావనియు యుక్తమైనవనియు సమర్థించుకొనవలసి వచ్చెను. 1924లో సైతముకసిఁదీర్చికొను నైతికవిధానముధమూథమమని చెప్పఁగలిగిననీ. తికుశలుఁడు "మాకవసరముండెను గాన మేముజర్మను జిల్లాలనాక్రమించుకొని స్వాధీనపఱచుకొంటిమి."

అని వారలుసంవత్సరములనుండియుఁ బ్రకటించుచున్న నైతిక సిద్ధాంతములకు విరుద్ధముగ లజ్జలేక చెప్పఁగడగెను.

తమపలికిన నుడువులను బ్రకటించిన యాశయములకు సంపూర్ణవ్యతిరిక్తమార్గమున నీనీతివిశారదు లేలప్రవర్తించి యుండిరి? యుక్తములగు కారణములులేకున్నను దురాశాపరులై వీరిట్లుసంచరించియుందురా? ఈప్రశ్నలకిచట సమాధానమీయవలయును; యుద్ధముసాగించుటలో జయమేముఖ్యమని యెంచి యప్పటికున్న యంతర్జాతీయయుద్ధధర్మములకు విరుద్ధముగా జర్మనీవారును వారిమిత్రులును సంచరించిరని వారిపై విద్వేషభావములు మిత్రమండలివారిలో బ్రబలియుండుట కొంతవఱకుఁ గారణమైయుండవచ్చును. ఈభావములకుఁదోడు "పానుజర్మానిజము" అను సిద్ధాంతము రెండవవిలియము కాలమునాటినుండియుఁ బ్రచారములోనికివచ్చి వివిధదేశముల నీతిమంతులకు జర్మనుల యాశయములంగూర్చి యనుమానమును గలిగించుచువచ్చెను. పానుజర్మానిజమును దానికర్థమేమని యడుగవచ్చును. ఈసిద్ధాంతముయుద్ధమునకుఁ బూర్వము తరువాతనుగూడ ననేకజాతులవారికి భయానుమానములఁ గలుగుజేయుచుండెను. అందులోముఖ్యముగ నైరోపాఖండములోఁ దూర్పునను నాగ్నేయమునను నున్నచిన్నసంస్థానములలో జర్మనులు తమప్రభావమునుజూపించుట కుద్యుక్తులై యున్నారని యనుమానము మెండుగానున్నది.

జర్మనులు తమకుఁదూర్పుననున్న పొరుగుజాతుల వారల కంటె నైదువందలవత్సరములకుఁ బూర్వమేయధిక ప్రబోధము కలిగియుండి మధ్యయుగములలో నీతూర్పు ఐరోపాఖండ భాగము జనసమ్మర్దము లేక యుండుటచే నాభాగములందు జర్మనులువలసలనేర్పఱచుకొని కాపురములుండఁ జొచ్చిరి. 1212సం వత్సరము వఱకును బొహీమియా రాజ్య మేర్పడనేలేదు. తూర్పైరోపాఖండములో బ్రిగ్యాములవారు రాజ్యములేర్ప ఱుపఁబ్రయత్నముల సల్పుచు రీఖువారల సాయము కోరుచుం డిరి. బొహీమియా దేశపురాజులు రాజ్యమునకుఁ జెందిన రాజ వంశస్థులైయుండుటంబట్టి జర్మనురాజుల సాంప్రదాయముల ననుసరించి యట్టిరాజ్యపు దర్బారుల నేర్పాటు చేయుచుండిరి. జర్మను వర్తకులు ఖనికులు ధర్మప్రచారకులు నీరాష్ట్రములలో బ్రవేశించి వాసములేర్పఱచుకొనుటచే వారిధర్మసంహితలు గూడ నచట బ్రచారములోనికి వచ్చినవి. ఈ ధర్మసంహితల ననుసరించుటచేఁ బ్రజలకు సౌకర్యములు మెండగు చుండెను. ఇట్టి జర్మనులకంటె నల్పప్రబోధము కలిగియున్న దేశప్రజల నాగరికులుగా నొనర్పుచుఁ దమయొద్ద బానిసలగానుండిన స్లావులకుఁ బౌరాధికారముల నొసంగుచుండిరి. బహుపురాతన కాలమున వ్రాయఁబడిన పుస్తకములలో నీజర్మనులధర్మసంహిత అను పేరొకటిఁ గనుచున్నారము. చుట్టుప్రక్కలనున్న బొహీమియాకుఁ జెందని రాజ్యములు పెఱుగుచుండుటవలనే సుడటను జర్మనులున్న జిల్లాలేర్పడినవని మనము నిశ్చయింప

వచ్చును. బొహీమియా యడవుల వసించువారు బవేరియా దేశస్థులు; ఎగర్లాండు, వాగ్దలాండు మండలములలోని ప్రజలు ఫ్రాంకోనియనులు. బొహీమియా ఈశాన్యభాగమున వసించువారు సైలీషియనులు. ప్రేగులో మొదట 1362లో స్థాపింపఁబడిన విశ్వవిద్యాలయము జర్మనులచేతనే స్థాపింపఁబడియుండుటచే నాప్రాచీనకాలములో జెక్కులకును జర్మనులకును విరోధమేమియు లేదనియును, దొలి జర్మనులు బలవంతముగా బొహీమియాలో భాగములు నాక్రమింప లేదనియునుఁ జెప్పిన సత్యవిరుద్ధమైయుండదు. పదునేడు వందలనుండియు నిప్పటి వఱకును జెక్కులకును జర్మనులకును భాష ననుసరించి యేర్పడు సరిహద్దులలో నెట్టిమార్పును జరుగలేదని జెక్కు చరిత్రకారులే యంగీకరించుచున్నారు. ఈసత్యమును బాటింపకయే 1919లో జెకోస్లోవేకియా రాజ్య నిర్మాణమును మిత్రమండలివారి చాణక్యులు గావించిరి.

జర్మనులిపుడుకూడఁ దూర్పునకుఁ జొచ్చుకొనిపోవుటకు దీవ్రప్రయత్నములను సలుపుచున్నారనుమాట నిజము కాదు. ప్రాగ్దేశస్థుల ప్రబోధమభివృద్ధిఁజెందినకాలదిని జర్మనులు ప్రాగ్భాగములలో వలసలనేర్పఱచుకొను ప్రవృత్తి క్షీణించి తుదకంతరించినది. ఇపుడు నుడటను జర్మనులకును జెక్కులకును సాంఘిక విషయములలో ప్రబోధములోనుగూడ భేదములత్యల్పములు. రెండుశతాబ్దములకుఁ బూర్వమునుండియు నుడటను జర్మనులకును జెక్కులువసించియున్న మండలము

.కనుగల సరిహద్దులలో మార్పులేవియును లేకపోవుట పైఁ జెప్పినవిషయమునే బలపఱుచుచున్నది.

జెకోస్లొవేకియా తరపున మూఁడునివేదికలు మిత్రమండలిపక్షమునఁ బాటుపడుచున్న రాజకార్య దురంధరులచు సమర్పింపఁబడినవి. మిత్రమండలివారు జెకోస్లొవేకియా రాజ్యమును నిర్మించునపుడీ నివేదికలను విస్తారముగాఁ బాటింపలేదని రాజ్యములో నధికారస్థానము నలంకరించుచున్న జెక్కు దేశాభిమానులుకూడ రాజ్యస్థాపనానంతరము దానిని నిరూపింపఁ బ్రయత్నము సేయుచుండిరి. వీరివచనములు సర్వసమ్మతములు మాత్రముకావని డేవిడుహంటరు మిల్లరను నాతఁడు ప్రకటించిన "నాదినచర్య" అను దానింబట్టి స్పష్టము. అతఁడునూతన రాష్ట్రనిర్మాణముఁగూర్చి సంధినియమములను నిర్ణయించుచున్న యధికార చతుష్టయమున కుపదేశముఁ గావించుట కేర్పడిన సంఘములోఁ బాటుపడిననీతిజ్ఞుఁడు. డాక్టరు బెన్నిసు మున్నగువారు వ్రాతమూలమున దాఖలుచేసిన వానియొక్కయు ను నోటితోఁజెప్పిన వానియొక్కయు సుదంతముల పరిపుష్టి గూడఁ దెలియఁబఱచినట్లుండునని మిల్లరుపుస్తకమును బట్టి స్పష్టమగుచున్నది. ప్రారంభమునుండియుబోహీమియా మొరేవియా సైలేషియాలు రాష్ట్రములుగా నేర్పడియుండెననియు ...రాజవంశమును వారి స్వాతంత్ర్యమును 1747 వత్సరము వఱకును స్థిరముగా నుండెననియు 1919 నాటి పరిస్థితులలో నాటిప్రాంతము లంతముఖ్యములు కాకపోయినను నయ్యవి

ప్రజల హృదయాంతరాళములలో నాటుకొనియుండుటచే నిరాకరింపదగినవి కావనియు, నీచరిత్రాత్మకవిషయముల వలననే జర్మనులు చుట్టుకొనియుండినను వారితోఁ బోరాటను సల్పుటకు జెక్కులను ప్రోత్సహించినవనియును ప్రజాతంత్రపరిపాలనావిధానమును ప్రతిదేశమునను స్థాపించుటకై మిత్రమండలిపక్షమున యుద్ధముచేయుటకు జెక్కులు వెనుదీయలేదనియును మిత్రమండలివారిలో ధర్మోద్రేకమును గలుగఁజేసిన యాశయములే జెక్కులనుగూడ వారితరపునఁ బోరాటమును సల్పుటకుఁ బ్రోత్సహించెననియు ననునవియందు ముఖ్యాంశములు. దేశమును విడిచిపోయిన యల్పసంఖ్యాకులగు వారిట్లు చెప్పుచుండ దేశములోని వారుమాత్రము విరుద్ధముగా సంచరించుచుండిరి. 1918లో సైతము పత్రికలలోను రీఖుస్టాగు నొక్క ట్రిబ్యూనునుండియును నాస్ట్రోహంగేరియను రాష్ట్రమునకును రాజకుటుంబమునకును జెక్కుప్రజలు దృఢమగు భక్తిని గలిగియున్నారని ప్రకటించిరి.

1908లో డాక్టరు బెన్నిసుగారు వ్రాసిప్రకటించిన పుస్తకములో నాస్ట్రియా రాష్ట్రమందుఁ దనకున్న నిశ్చలభక్తిని బ్రకటించియుఁ బశ్చిమఖండములో స్లోవ్రాంతివారు పురోగాములై యుండుట కొనసాగునను, జర్మనులనుండి ప్రజాతంత్రరాజ్యపాలనావిధానమును గాపాడుటకును, 7,400,000 జనసంఖ్యగల జెక్కుజాతివారికి 7,400,000 జనసంఖ్యగల తదితరజాతులవారిని బరిపాలించు నధికారమొసంగుమని దృఢముగఁ

గోరెను. ఇట్టి మడిశాంతముల నాంగ్లేయులకు నమెరికనులకు నిష్టమగునట్లుచేసి యపనమ్మకమేమైన నుండిన నద్దానిం దొలగించుటకై బొహీమియాలోనున్న జర్మనులసంఖ్య 1,500,000, అనియు నాష్ట్రియనుల జనసంఖ్య సత్యమైనదిగాదనియుం బ్రకటించిరి.

జెకుల సామ్రాజ్యాశయము లీరీతిని ఫలింపంగనే జెకునాయకులు తేనెలొలుకు పలుకులంబలుక నారంభించిరి. 200 సంవత్సరములకుం బైగాం బరదేశీయ పరిపాలనకులోనై యుండిన జెకులుం దమపరిపాలనకులోనై యున్న ప్రజలను ధర్మముతోను, న్యాయముతోను, విచక్షణతోను, దయాదాక్షిణ్యాదులతోను బరిపాలించు విధమును నెఱింగియున్నారనియు, వారిలో నసూయాది భావములుగాని విద్వేష భావములుగాని యుద్భవింపకుండంజేయురీతి వారికి దెలియుననియు, నుడటను జర్మనుల నణంగంద్రొక్కు నుద్దేశము లెస్సయుం దమకు లేదని యుం బ్రమాణపూర్వకముగాం జెప్పిరి. "చరిత్రచే నిర్ణీతములగు సీమలు" స్థాపింపవలెనని మిత్రమండలివారి నెడతెఱపిలేక వీరు ప్రార్థించిరి. చరిత్రచే నిర్ణీతములగు సీమలం బాటింపవలసివచ్చిన మొదల హంగరీనుండి స్లావేకియాను విడందీయుట యుక్తమైన పనిగాదు. ఏలయన గత వేయువత్సరములనుండియు స్లావేకియా హంగరీలో నొకభాగమై యుండెను. కావున, నీవిరోధమును గని చుట్టుప్రక్కలనున్న మండలముల నిచ్చినంగాని బొహీమియా స్థిరముగానుండనేరదని చెప్పనారంభించిరి. 1919 సంవ

త్సరపు ఫిబ్రవరి 17 తేదీని కాంబనసనీతిజ్ఞుఁడు "జాతిసంబంధ విషయములచేతనే యేర్పాటుకావింపఁబడు జెకోస్లావేకియా సీమాలు దేశమును రక్షణరహితముగను నార్థికముగ సంరక్షితముగను నొనర్చునని నిశ్చయమగుటవల్ల నార్థిక సంబంధములు గలట్టివియు సాంగ్రామిక రక్షణసంబంధములు గలట్టివియునగు విషయములఁ బాటింప వలసివచ్చినది" అని బహిరంగసభలో వాక్రుచ్చెను. ఈవిషయములఁ బట్టిచూచినను నార్థిక సాంగ్రామిక సంబంధ విషయములే జెకోస్లావేకియా రాజ్యసీమల నిర్ణయమునకుఁ గారణమయ్యెననియు, నానిర్ణయములో విల్సనుమున్నగు నీతివిచక్షణులు ప్రకటించిన నిర్ణయసిద్ధాంతము పాటింపఁబడక నిరాకరింపఁబడెననియు స్పష్టముకాఁగలదు. దీనిలోనుండు జర్మనులసంఖ్య తగ్గింపఁదగినంతవఱకును తగ్గించుటకును, ఎవరునిర్ణయించినను వారివారి యిష్టములేకున్న నొక దేశమునుండి యింకొకదేశమునకు జనులు మార్పఁబడకూడదను విల్సను ప్రకటనకు వ్యతిరేకముగానైనను బరాసులు చేయుటకు నిశ్చయించుకొనిరి. తనసిద్ధాంతములకు వ్యతిరేకముగా సంచరించినందులకు విల్సను మొదట విసుగుకొనెను గాని "యంతర్జాతీయ సమితి" స్థాపింపఁబడుటచే నయ్యది వివిధజాతులవారలకు సంధి సమయములవలన జరిగిన యన్యాయములను దిద్దుపఱచునను దృఢనిశ్చయముతో నుండుటచే నీయేర్పాటును రద్దుచేయుటకుఁ బాటుపడలేదు. సెంటు జర్మను సంధి సమయములలో నిర్ణయింపఁబడిన విధమున నల్పసంఖ్యాక " తమకుఁజాతిరక్షణ

గావింపఁబడలేదని 1920లో జెకోస్లావేకియనుల శాసనసభ
కెన్నుకొనబడిన జర్మను ప్రతినిధు లంతర్జాతీయ సభవారికొక
నివేదికను దాఖలుచేసిరి. 1922 గ్రీష్మఋతువులో జెకోస్లా
వేకియాలోనున్న జర్మనులు, మగ్యారులు, స్లావకులు, కార్ప
థోరవ్యనులు, జెక్కుల యధికారులు యుక్తముగా సంచరిం
చుటలేదని యొకనివేదికను దాఖలుచేసికొనిరి. కాని డాక్టరు
బెనిస్సు రాజ్యమందు భక్తిగలవారై యున్నఁగాని సెంటుజర్మను
సంధిలోనున్న సమయములు ప్రకారము వారిని బరిపాలించుట
జరుగదని తెలుపఁగనే యంతర్జాతీయసమితివారా నివేదిక నొక
మూలను బడవైచిరి.

జెకోస్లావేకియాలోనున్న జర్మనుల సంఖ్యనుబట్టి చూచిన
యెడల నల్పసంఖ్యాక జాతిగణములను రక్షించుటకై యేర్ప
డిన సూత్రములు వీరికి వినియోగించుటకు వీలున్నదని చెప్ప
నేరము. ఈరాష్ట్రములో రొమేనియనులు, పోలులు మగ్యా
రులు కార్పథోరవ్యనులనను వారల్పసంఖ్యాకజాతి గణము
లకుఁ జెందియున్నారు. నూతన నిర్మితరాష్ట్ర సంబంధసంఘ
మువారీ విషయమును మొదటనే గమనించి జెకోస్లావేకియా
లోనుండు జర్మనుల నల్పసంఖ్యాకజాతిగణ రక్షణనియమము
లకులోనగునట్లు చేయుట సమంజసముకాదనియు నారాష్ట్రము
యొక్క శ్రేయస్సు జెక్కులరాజనీతిపై నాధారపడియుండునని
యుఁదెల్పిరి. డాక్టరు బెనిస్సుసంఘమున కీవిషయమై యొక
నివేదికను దాఖలుచేసికొనియుండెను. అందాఖలు వచనమిట్లు

న్నది; "ఈపరిపాలన మత్యంతౌదార్యముతో స్థూలలక్ష్యము లఁ బాటించుచు స్విడ్జరులాండు పరిపాలనావిధానము ననుకరించి యుండును." స్విడ్జర్లాండులోని యన్నిజాతులవారును సమాన హక్కులను గలిగియున్నారు. పరిపాలన నారంభించునప్పుడే యల్పసంఖ్యాకజాతి గణములవారలుదమకంటెఁ దక్కువవారని పరిగణించు జెకోస్లొవేకియను ప్రభుత్వమునకును స్విడ్జర్లాండు ప్రభుత్వమునకును నెట్టిసామ్యమును గానుపించదు.

డాక్టరు బెనిస్సుమున్నగు రాజకార్యదక్షులు తమ ప్రమాణములనెట్లు పాటించరో యీక్రింద నిరూపింపఁబడిన జర్మనుల నిరూపణములవలన స్పష్టమగును. సుడెటను జర్మను పక్షప్రతినిధి హెర్ సెబెకోవిస్కీ 1938లో కారల్సుబాదు సమావేశములో నివేదించినవిషయము లిచటఁ బొందుపఱుపఁ బడుచున్నవి. వానిని ఖండించుచు జెకోస్లొవేకియను ప్రభుత్వ మునందెట్టి నివేదికయుఁ బ్రకటింపఁబడలేదు. హెర్ సెబెకో విస్కీ నివేదికలోని విషయములివి.

(1) 1921 మొదలు 1938 వఱకు జర్మను జనాభాలోఁ బెరకువ 70,759 అనఁగా జర్మను జనాభాలో 2.6% మాత్రమే పెంపుజరిగినది. కాని యొక్క జర్మను జిల్లాలలో జెక్కుల యభివృద్ధి 78, 806, అనగా 28.9% జరిగినది. ఈ జర్మనుజిల్లా లలోజరిగిన జెక్కుజనాభా పెంపుమిగిలిన 99 బొహీమియను జిల్లాలలోజరిగిన పెంపుతోసమానమని తెలియునగును.

(2) ఈగత యిరువదివత్సరములలోను సుడెటను జర్మను జిల్లాలలో రాజకార్యములను వారియిచ్ఛానుసారముగఁ గావిం చుకొనుటకై 150,000 జెక్కులకు వాసములం గల్పించిరి.

(3) పరిపాలనలో నధిక వేతనములిచ్చునున్నతోద్యోగ ములును రైలువేయధికారవదవులును తపాలా సంబంధమైన యుద్యోగములును న్యాయాధికారోద్యోగములును చాలవఱకు జెక్కులకే యీయఁబడుచున్నవి.

(4) అల్పవేతనముగల యుద్యోగములు బ్రతికిచెడిన జెక్కులకీయఁ బడుచున్నవి. ఇది జెక్కుపాఠశాలలఁ దెఱచు టకుఁగావింపఁబడిన యెత్తనిగ్రహింపనగును.

(5) సుడెటనుజర్మనుల యాస్తులను క్షీణింపఁజేయుటకై వివిధసూత్రములు కనిపెట్టఁబడి యమలులో నుంచఁబడినవి.

(6) పంటభూములఁగూర్చి కావింపఁబడిన నియమము లనుబట్టి 10,000,000 యకరముల వైశాల్యముగలభూమి ప్రభుత్వముచేఁ దీసికొనఁబడినది. ఇందులో 15% మాత్రమే జెక్కులకుఁగాని స్లావక్కులకుఁగాని చెందియుండి మిగిలిన 75% జర్మనులకును మగ్యారులకును జెందియుండెను.

(7) 1921 మొదలు 1927 వఱకు సుడటెనుజిల్లాలలో 600,000 యకరములభూమి ప్రభుత్వముచేఁ దీసికొనఁబడినది. ఇందు 377,500, యకరముల వైశాల్యముగలభూమి జర్మను లకుఁజెంధియున్నదే.

(8) 597,500, యకరముల వైశాల్యముగల భూమి వ్యవసాయముకొఱకుఁ బ్రభుత్వముచేఁ బట్టాలరూపముగా జెక్కులకొసంగఁబడెను. 1500 యకరములుమాత్రమే జర్మనులకుఁ బట్టాలీయఁబడినవి. దీనివల్ల సుడెటనుజర్మనులకుఁ గలిగిననష్టము 1,200,000,000 జెక్కు క్రోనులు. జెక్కులకుఁ గలిగినలాభము 1,100,000,000 జెక్కుక్రోనులు.

(9) జెక్కుజాతియుద్యోగులలో 1921 మొదలు 1930 వఱకు జరిగినపెంపు 21.8%. జర్మనులకిందుఁ గలిగినపెంపు 1%. ఇందుఁ బొందుపఱుపఁబడినపట్టిక యీవిషయమును స్పష్టపఱచును.

(10) 1921 మొదలు 1937 లోపున మూసివేయఁబడిన జర్మనుల ప్రాథమికపాఠశాలల సంఖ్య 1113, అనఁగా 11.3%. ఈసమయముననే క్రొత్తగాఁ దెఱువఁబడిన జెక్కుపాఠశాలలసంఖ్య 1035, అనఁగా 9%.

(11) జెక్కులపాఠశాల సంఘములు తత్పాఠశాల సంఖ్యాభివృద్ధికై సుడెటను జర్మనులు జిల్లాలలోనే పాటుపడుచుండిరి. వారిపాఠశాలలు జెక్కులులేని ప్రదేశములలోను, పాఠశాలలకుఁబోవఁదగిన వయసులోలేని బాలురు గల ప్రదేశములలోను నధికముగాఁ దెరువఁబడినవి.

(12) ఆర్థికముగను సాంఘికముగను నిర్బంధములను గలుగఁజేసి జర్మనులీపాఠశాలలకుఁ దమబిడ్డలను బంపునట్లు

చేసెదరు. ఆకారణముచే బాలురు పాఠశాలను వదలినపిమ్మట వారు జెర్మను భాష రానివారును మాతృభాష మఱచినవారును నగుదురు. జర్మనుల విశిష్టజాతి చిహ్నములను వారుపోఁగొట్టుకొనునట్లు ప్రభుత్వ మీవిధముగఁ జేసిన ప్రయత్నములన్నియు వ్యర్థములైనవి.

(15) విశిష్టజాతి చిహ్నాలను వారుపోఁగొట్టుకొనుటకై జెకులుపయోగించుచున్న సంస్థలు—

(అ) పాఠశాలలు

(ఆ) వార్తాపత్రికలు

(ఇ) దేశబహిష్కృతుల నొనర్చుచున్న చట్టములు.

(ఈ) జనాభాలెక్కలు

(ఉ) రైలువే యధికారవినియోగము

(ఊ) న్యాయస్థానము

(ఎ) భాషల నెంచుకొనుటలో నిర్బంధములు

(ఏ) ప్రతిజాతికిని వేఱువేఱుగానుండు ధర్మసూత్రములను ధర్మ సంహితలలో నిమిడ్చియుంచుట —

(ఐ) ఉద్యోగముల నిచ్చుటలోఁ బక్షపాతముతో సంచరించుట —

(ఒ) జర్మనులు, మగ్యారులు, నధికముగానుండు మండలములను జీల్చివేయుట.

(ఓ) ప్రజల సౌకర్యములకై గావింపఁబడు శిల్పాది నిర్మాణములలోను, బొటలు తయారుచేయుట మున్నగు వానిలో జెక్కు వ్యాపారస్థులకే పక్షపాతము నగపఱచుట.

(క) అల్పసంఖ్యాకజాతిగణముల ప్రబోధము క్షీణించు విధానముల నవలంబించుట.

ఇదకుఁ గొలదికాలముక్రిందట రాష్ట్రరక్షణ చట్టమొకటి శాసనసభచేఁ దీర్మానింపఁబడినది. సరిహద్దు జిల్లాలలో 'సాంగ్రామిక ధర్మము' విని యోగింపఁబడుననియు నంతరము ప్రకటింపఁబడినది. ఇదియే యల్పసంఖ్యాక జాతిగణములను సాంగ్రామికా నియంత్రితప్రభుత్వ విధానమునఁ బాలించుటయని విద్వాంసులు చెప్పుచున్నారు. ఈవిషయములన్నిటిని దెల్పుచు నుడెటను జర్మనులకు, జెక్కుపరిపాలకులు గావించిన ప్రమాణముల ననుసరించి ప్రవర్తింపలేదనియు, వారివిశిష్టజాతి చిహ్నములను రద్దుపఱచుటకుఁ దీవ్రప్రయత్నములను సలుపుచున్నారనియు, జర్మనుల జిల్లాలలో జెక్కు "బీజములను" నాటిబోహీంమియాలో జర్మనుభాష మాటాడు మండల మొకటియులేదని నిరూపించుటకు జెక్కులు పాటుపడు చున్నారనియును, జర్మనుల రాక్షసబొగ్గు గనులున్న మండలములలోను, బరిశ్రమస్థానములలోను నీకార్యమత్యంతము 1920 నుండియుఁ గావింపఁబడుటచే జర్మను పరిశ్రమలు క్షీణించుచున్నవని నిందించుచుండ జెక్కుపాలకులు యుద్ధమునకుఁ బూర్వము జర్మనులకు నాస్ట్రియా ప్రభుత్వము పక్షపాతము చూపించుచుండె

ననియు వారలకవసరమైన దానికంటె నధికసంఖ్యగల పాఠశాలలు జర్మనుమండలములలో నుండుటచే వానిని తగ్గించుట యవసరమనియుఁ జెప్పి తమకార్యమును సమర్థించుకొను ప్రయత్నముల సలుపుచుండిరి.

1919 నాటినుండియు జెక్కుపరిపాలకు లల్పసంఖ్యాక జాతిగణముయవలంబించిన నైతికవిధానములగూర్చిజర్మనులను దమవిశిష్టజాతి చిహ్నములఁ బోగొట్టుకొనునట్లుచేసి వారిని నిర్బంధముగా జెక్కులగునట్లు చేయుటయేయని స్పష్టము. డాక్టరు బెనిస్సు "జెకోస్లోవేకియాలోనున్న జర్మనులు దీనుకై యుండుటచే వారల నతిత్వరలోఁ దదితరులు తమలో సమ్మిళితమగునట్లొనర్చెదరు"అని హాంస్రిబోర్డోయను పరాంసులకాడమీసభ్యునితోఁ జెప్పెనఁట! జెక్కురాజనీతిపరుల యాశలెట్లుండెడివో యీక్రిందఁ బొందుపఱుపఁబడిన దానింబట్టిస్పష్టమగును.

"ఫ్రిజియనులను, డేనులను, బాల్టిక్కు పోమిరేనియనులను మనులు జెటియనులను, జెక్కుసైలిషియనులను, పోలిషుసైలీషియనులను, మీస్సెను, సజాలలోనుండు సెర్బును, బొహీమియను విపినములపైగానుండు జెక్కులను, జెకోస్లోవేకియనులను, నాస్ట్రియాలోను నాల్గులున్న మండలములలోనుయున్న జెక్కులను స్వతంత్రులుగా నొనర్చినఁగాని కొంతకాలమైనను శాంతియుండదు." ఈవచనములను వ్రాసినగ్రంథకర్త జర్మనుదేశముచుట్టును బఫరులవలెనుండు రాష్ట్రములను నిర్మించి జర్మనుల నణఁగఁద్రొక్కుటయే ముఖ్యకర్తవ్యమనికూడ వ్రా

సెను. 1938 మే 15 తేదీనాటి "సెవేరోసెస్కి-డెనిక్కు" అను వార్తాపత్రిక సంచికలో నీయుద్దేశములే ప్రకటింపఁబడినవి. "భావ్యభ్యుదయమంతయు స్లావులదే. జర్మనులు దుర్బలులు శక్తిహీనులునైరి! ఆల్ప్సుమొదలుకొని వ్లాడివాస్టక్కువఱకు దుర్జయులగు స్లావుల యధికారాభివృద్ధిపై నాధారపడి యుండఁగలము. బెర్లిను ప్రభుత్వము మనవిదారణమును గావించుటకు బ్రయత్నముల సల్పుచున్నది. ఈనాడు స్లావులలో నంతఃకలహములను బుట్టించు ప్రయత్నములను గొనసాగనీయరు. వారి విదారణమున కొప్పుకొనరు. తుదకు స్లావుల మహాపక్షము జయమునుగాంచును. అప్పుడే మానవకోటి, జర్మనులు నెలకొల్పలేకపోయిన శాంతి ననుభవింపఁగలదు. ఇప్పుడు నవీన రష్యాదేశమెట్లు దుర్జేయమైయున్నదో యా విధముననే యాల్ప్సు మొదలు వ్లాడివాస్టక్కువఱకు వ్యాపించియుండుస్లావుల భ్రాతృగణము భావికాలములో దుర్జేయమై యుండును."

1919 మొదలు నేటివఱకును జెక్కులు తమ జర్మను సోదరులకుఁజేసిన ప్రమాణములను నిలుపఁబెట్టుకొని న్యాయముగా సంచరించు నవకాశముఁ గలిగియున్నను నట్టియవకాశములను నిరాకరించిరి. సుడెటనులోని జర్మనులలో మూఁడు పక్షము లేర్పడినవి. అందు "క్రిస్టియను సోషలిస్టు" పక్షమువారును హెన్లెనాయాధిపత్యము క్రిందనున్న "కర్షక" పక్షమువారును జెక్కుప్రభుత్వమునకుఁ దోడు పడనియ్యకొని తమ ప్రతినిధుల నిరువురను మంత్రిపదవుల నంగీకరింప నిరా

గించిరి. ఇదిజర్మనుల "సోషలు డెమాక్రాటు" పక్షమునకు విరుద్ధముగఁ గావింపఁబడెను. వారిక్లైదు సంవత్సరములు తను సాయమును బ్రిభుత్వమునకుఁ జూపుచుఁ బాటువడిరి; కాని పరిపాలనలో వారి యుపదేశములు సంపూర్ణముగ నిరాకరింపఁ బడుటచేఁ దుదకు నైరాశ్యముఁజెంది పనులనుండి తొలగి పోయిరి. తాము మోసగింపఁబడితి మను నిశ్చయముతో వారు తమపక్షమును వదలుకొని హెర హెన్లీనను నాతని నాయ కత్వముక్రింద నున్న సుడెటను జర్మనుల పక్షమునఁ జేరిరి. జర్మను లలో నిపుడాపక్షమునకు 90% చేరియుండిరి.

హెరు హెన్లీనుయొక్క పక్షమీమధ్యను జరిగిన శాసన సభయెన్నికలలోఁ బొందిన జయము రీఖువారి సాయమువలనే జరిగినదని చెప్పుచున్నారు. రీఖులకును సుడెటను జర్మనులకును సంబంధబాంధవ్యములుండుటచే నాయుభయుల యాశయములు నుద్దేశములును సమానకోటి నధివసించి యుండెను. 1932 వఱ కును రీఖులలో ననేకములగు పక్షములుండి యైకమత్యము లేకుండ యుండినవి. అటుపిమ్మట హిట్లరు నాయకత్వముక్రింద రీఖుజర్మను లందఱును కాకట్టై యుద్ధమునఁ గోలుపోయిన శక్తిసామర్థ్య ముల నుత్సాహముతోఁ దిరిగి సంపాదించిరి. ఇట్టి వ్రిబల పక్షము తమప్రక్క నేర్పడియుండ, స్వాతంత్ర్య సంపాదనాశ యములు తమ మానసముల నుద్రేకపూరితములుగా నొనర్చు చుండ సుడెటనుజర్మనులు రీఖు జర్మనులతోఁగలిసి తమమాతృ దేశసిద్ధికై పాటుపడుట సహజమైన నాశ్చర్యము నొదవింపదు.

హిట్లరు తనశక్తిని ధృఢపరచియే తనయభీష్టములు నెరవేర్చుకొను చున్నాడు. నాజీసిద్ధాంత ప్రాబల్యమునకై జర్మనులందఱు తమ సర్వస్వమును ధారవోయ సంసిద్ధులైయుండిరి. రీఖువారి సంవర్ధనమునకవకాశము దొరకినది. రాజనీతి కరుడగు హిట్లరుకోరియుండగా, చేసినప్రమాణముల నన్నిటిని మంటం గలిపి జెక్కు ప్రభుత్వమువారు సుడెటను జర్మనుల నాశముచేయ సంసిద్ధులైయున్నారు. ఈవిషయము వారిహృదయములు నాటి నపుడు వారు ప్రబలమగు రీఖుసోదర సాహాయ్యముతోఁదత్ప్రభుత్వము నెదిరించుటలో వింతయేమియును గానుపించదు.

సుడెటను జర్మనులను జెక్కు ప్రభుత్వ మెట్లణఁగఁద్రొక్క బ్రయత్నించినదో కొంతవఱకు మనముకనుగొనవలసియున్నది. 1918 నుండి యిప్పటివఱకుఁ గార్మికులలో నిరుద్యోగులైనవారి సంఖ్య 200, 000 కన్న మించినది. ఇపుడు జెకోస్లావేకియాలో 755,000 మంది నిరుద్యోగులైయున్నారు. వారిలో నధికసంఖ్యాకులు జర్మనులే. అది 400,000 అనియు తెలియుచున్నది. 16 జిల్లాలలోను నిరుద్యోగ మత్యధికముగనేయుండెను. అందులో 15 జిల్లాలు సుడెటను జర్మనులవనియును నొకటి మాత్రము జెక్కులుదనియును, 1935లో జెక్కులలో నిరుద్యోగులైనవారు 1000కి 30.5 అనియు తెలియవచ్చుచున్నది. 1936లోఁ బరిశ్రమాభివృద్ధిని గలుగఁజేసి జెక్కులలో 272,000 మందికి నుద్యోగములను గల్పించిరి. జర్మనులలో మాత్రము 78,000 మందికన్న తక్కువమందికే యుద్యోగములను గల్పిం

చిరి. జెక్కు మండలములలోని పరిశ్రమలకే ప్రభుత్వము సాయము చేయుచుండెను. జెక్కు మంత్రులు కొందఱే దురవస్థనుగాంచి జర్మనుప్రజలకు న్యాయముచేయఁ బ్రయత్నించిరి. కాని యేమియుఁ జేయలేకపోయిరి. ఇదియిట్లుండఁ గోరు చుట్టుపై రోఁకటిపోటన్నట్లు జెక్కులు జర్మనుల కష్టములను జూచి సంతసించుచుండిరని వార్తాపత్రికలు ప్రకటింపఁజొచ్చినవి. 1936 ఆగస్టులో "స్ట్రాజునరోడా" అను పత్రిక యీ క్రిందివిధమునఁ బ్రకటించెను. "హోహెనెల్బి బిజౌటెరీ ఫ్యాక్టరీ" ఇపుడే వేలములో విక్రయింపఁబడెను. దానిని సోకోలు సంఘము వారు కొన్నందుకందఱును సంతసించుచున్నారు. ఆకర్మాగారములోని యంత్రములు విక్రయింపఁబడి తొలగింపఁబడిన పిమ్మట నాగృహమున నొక "జిమ్నేజియము" స్థాపింపఁబడును. ఇట్లు జర్మనుపరిశ్రమ లంతరించినచోటులలో జెక్కు ప్రచారమునకు నూతనస్థానములను "రీజనుగేబిర్జి"లో నూతన మగు జెక్కు బురుజులు నిర్మింపఁబడును."

జెక్కు ప్రభుత్వ మీవిధముగ సంచరించుటచే జర్మనుల దురవస్థ మితిమీఱియుండెను. ప్రజలలో నధిక భాగమునకుఁ దిండిలేకుండుటచే వారు కృంగి కృశించిపోవుచుండిరి. కట్టుటకు వస్త్రములులేక చలిబాధకులోనగుచు ననహ్యాకరమగు గుడిసెలలో నతిహీనముగాఁ గాపురముచేయుచుండిరి. జర్మనీ జెకోస్లొవేకియాల సరిహద్దులలోను జెకోస్లొవేకియాలోను నున్నజర్మనులగతి యిట్లుండెను. ఆసరిహద్దునకావల జర్మనీలోనున్నవారి

స్థితి మిగుల బాగుగనేయున్నది. నిరుద్యోగము వారినంతగా బాధింపలేదు. ఇట్లుసుఖముగను గౌరవముగను దోడివారు తమ దేశములో జీవించుటమాని సుడెటను జర్మనులు తమసోదరులతోఁ గలియుటకుఁ బ్రయత్నించినఁ దప్పేమి?

ఇది యిట్లుండగాఁ బ్రాగులో బోల్షివిక్కుల ప్రతిభ హెచ్చుచున్నదని జెర్మను వార్తాపత్రికలు చాటమొదలిడినవి. మ్యూనిసిపలు ఎన్నికలు జరిగినపిదప నాపత్రిక నీదిగువఁ జూపిన వివరణమును వ్రాసెను. "ప్రాగులో కమ్యూనిస్టులు వృద్ధిపొందుచున్నారు. అయిరోపామధ్యనున్న జెకోస్లావక్కు ప్రజాతంత్రరాజ్యము ప్రమాదకరమైన కమ్యూనిస్టుల కేంద్రస్థానముగుచు బెరుగుచున్నది. మఱియు జర్మనులతోను స్లావక్కులతోను జెర్మనులు సంప్రతించుకొనకుండనది జేయుచున్నది. బోల్షివిక్కులసాయముచే నీకమ్యూనిస్టులు గావించుచున్న చర్యలచే ఈవ్రాతలఁబట్టిచూచిన బలవత్తరములైన యిటలీ జర్మనీ దేశములలో విరోధము జెర్మనులకుఁ దప్పదని మా స్పష్టమయ్యెను. ఈజర్మను రీఖుప్రభుత్వముకుఁగోను పోలాండుప్రభుత్వముగూడ జెకోస్లావేకియా ప్రభుత్వముతో జెకోస్లావేకియా మార్గముకుండ తమదేశములోఁగూడ బోల్షివిక్కు ప్రచారము జరుగుచున్నదని మొఱవెట్టినది.

ఒక్క సుడెటను జర్మనులేకాక తదితరాల్ప సంఖ్యాక గణములవారుగూడఁ బ్రభుత్వముపై నసూయఁగలిగియుండిరి. 1918 మెయి 30 తేదీని మసరిక్కధ్యక్షుఁడు, ప్రభుత్వము తర

పున స్లావక్కులకుఁ బ్రభుత్వముఁ బరామర్శకక్రిందఁ దమపరిపాలనను దామే చేసికొనుటకును, తాము ప్రత్యేకశాసనసభను వేఱుగా నెలకొల్పుకొనుటకును దగినయేర్పాటులను జేసెదనని వారికొక యొడంబడికను వ్రాసియిచ్చెను. ఈయొడంబడికలో స్లావక్కు భాషవారి మండలములలో బడులలోను బరిపాలనములోను సాధారణములగు లోకవ్యవహారములన్నిటిలో నుపయోగించుటకు నధికారము స్లావక్కులకుఁ బ్రసాదింపఁబడినది. ఈయొడంబడికనే డాక్టరు బెనిస్సు "ఫ్రాంకుజాతీయ సంఘసమావేశము" జినీవాలో 1918 అక్టోబరు 31 తేదీని జరిగినపుడంగీకరించెను. కాని జెకోస్లావేకియా రాజ్యము స్థాపింపఁబడఁగానె స్లోవేకియాలో "సాంగ్రామికధర్మము" నమలులోఁ బెట్టి ప్రొఫెసరు టుకా, ఫాదరు హ్లింకాయు స్లావక్కు నాయకులను జెరసాలలోఁ బెట్టిరి. స్లావక్కులపై నెన్నివిధములనో పోలీసుచర్యలు మున్నగువానిని జేసి వారి నణఁగఁదొక్క ప్రయత్నముల నలుపుచున్నను స్వాతంత్ర్యమునకై స్లావక్కు దేశభక్తులు కావించుచున్న ప్రయత్నములు, పోరాటము నెడతెగక జరుగుచునే యున్నవి. జెక్కులు స్లావక్కుల పరిపాలన విషయములలోనైన నైకమత్యము కలిగియుండలేదని యీక్రింది జాతీయమునుబట్టి స్పష్టమగుచున్నది.

"జెక్కునఁగా నెవఁడు?"
"జెక్కు భాషమాటలాడువాఁడు"
"స్లావక్కునఁగా నెవఁడు"

"స్లావక్కు భాషమాటలాడు" వాడు

"అయిన జెకోస్లావ కెవడు?"

"జెక్కు భాషగాని స్లావక్కు భాషగాని మాట లాడనివాడు"

ఉంగ్యారులో "ఉక్రేనియన్ కార్పథోరష్యా నేష నల్ కౌన్సిలు" ఈమధ్యనే సమావేశమై కార్పథోరష్యాకు 20 సంవత్సరముల క్రిందట నిచ్చెదమని వాగ్దత్తము కావింపఁ బడిన స్వపరిపాలనాధికార మొసంగఁబడవలెనని దృఢముగాఁ గోరిరి. కార్పథోరష్యను శాసనసభను స్థాపించుచు రాజస్వ రక్షకశాఖలలో నుద్యోగములు రుథేనియనుల కొసంగఁబడ వలయునని కోరుచు నొకతీర్మానమును గావించిరి. 1918 నవంబరు 12 తేదీని కార్పథోరష్యను ప్రముఖులు.

(1) కార్పథోరష్యా మండలము విభజింపఁబడకుండుట యును (2) అద్దానికి జెకోస్లావేకియా రాజ్యరక్షణక్రింద స్వా తంత్ర్యముండుటయును,

అను షరతులపైనిగాని జెకోస్లావేకియా రాజ్యములో చేను చేరమని పట్టుపట్టిరి. వాని నధ్యక్షుఁడగు మసరిక్కంగీక రించెను. జెకోస్లావేకియా ప్రభుత్వమాషరతులేర్పడి యిరువది వత్సరములైనను నేటివఱకు వానినాచరణలో నుంచుట కెట్టి ప్రయత్నమును సలుపలేదు. ఈ మండల పరిపాలన సంపూర్ణ ముగా జెక్కుల హస్తగతమై యుండిపోవుటచే 100,000 కన్న నెక్కువగానున్న ప్రజలష్టకష్టములకునులోనై మాడి [illegible]